

Chandamama, July '49

Photo by N. Ramakrishna

బొగ్గుల్లో మాణిక్యం

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు - 1.

# మంచి మంచి పుస్తకాలు

మా ప్రచురణలు అన్ని హిగిన్‌బాథమ్సు బుక్ స్టాల్సులోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి. ఒకేసారిగా **6-0-0** పుస్తకాలు తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించెదము. లైబ్రరీలకు, పుస్తక వ్యాపారులకు మంచి కమీషన్ ఇవ్వబడును. వివరాలకు వ్రాయండి.

## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| సుభద | .. | 1 | 8 |
| దేవదాసు | .. | 1 | 8 |
| పల్లీయులు | .. | 1 | 8 |
| నవవిధాన్ | .. | 1 | 0 |
| చంద్రనాథ్ | .. | 1 | 0 |
| పరిణీత | .. | 0 | 12 |
| బడదీదీ | .. | 0 | 12 |
| పతివ్రత | .. | 0 | 12 |
| హేమాంగిని | .. | 0 | 12 |
| నిష్కృతి | .. | 0 | 12 |
| మావారు | .. | 0 | 12 |
| కాశీనాథ్ | .. | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కడపటిమాట | [రాధాకృష్ణ] | 0 | 12 |
| మాయమైన మణిహారం | .. | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్లికూతురు | .. | 0 | 12 |
| తగినశాస్తి | .. | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | .. | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | .. | 0 | 12 |
| అంతులేని ఆశ | .. | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | | |
|---|---|---|---|
| జాతిద్వేషి | [మైత్రా] అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం | .. .. .. | 0 | 12 |
| ఉదరనిమిత్తం | [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో | [రాయ్‌చౌధరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం | [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం | [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు | [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము | [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం | [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు | [నాటకం] | 0 | 12 |
| లంబకర్ణ | [పరశురాం కథలు] | 1 | 0 |
| సంధి | [యతీంద్ర మోహనసింహా] | 1 | 12 |

## కుటుంబరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| నిలవనీరు | [అత్యుత్తమ కథలు] | 1 | 8 |
| మొండివాడు | .. | 1 | 0 |
| కాలభైరవుడు | .. | 0 | 12 |
| వరప్రసాదం | .. | 0 | 12 |
| కవిరాట్టు | [గల్పికలు] | 0 | 12 |
| కులంలేని మనిషి | [నవల] | 0 | 12 |
| అరుణోదయం | .. | 1 | 0 |
| మారుపేర్లు | .. | 0 | 12 |
| నీకేం కావాలి? | .. | 0 | 12 |
| ప్రణయరోగులు | [నాటకం] | 1 | 0 |
| ఆరితేరిన ఘటం | (విదేశ కథలు) | 0 | 12 |
| రష్యన్ కథలు | | 0 | 12 |

# అట్టపీది బొమ్మ

గోకులంలో బాలకృష్ణుని బతుకు దినదిన గండమయిపోయింది. ఎలుక కోసం పొంచివున్న పిల్లిలాగ, కృష్ణుని చంపటానికి కంసుడు ఎన్ని ఎత్తులైనా వేస్తూనే వున్నాడు. కంసుని ఆజ్ఞప్రకారం మాయ పూతన తన విషపు పాలిచ్చి కృష్ణుని చంపబోయింది. బండిరూపంలో వచ్చి, శకటాసురుడు కృష్ణుని చంపటానికి యత్నించాడు. ఎత్తుకంటా ఎగరవేసుకపోయి, కృష్ణుని చంపుదామని తృణావర్తుడు వాయురూపం తాల్చాడు.

ఇన్ని గండాలు చుట్టుకున్నప్పటికీ, ఆ విష్ణుమూర్తి దయవల్లనే అవన్నీ తొలగిపోతూ వచ్చాయి. కాని, ఇలా భయంతో ఎన్నాళ్లు బతకటం? ఈ ప్రశ్నను ఊరి పెద్దలంతా కలిసి ఆలోచించారు. అందులో ఒక బుద్ధిమంతుడు—

"అబ్బాయిలూ! ఈ వూరిలో మన కష్టాలు గట్టెక్కే దారి కనపడదు. స్థలం మార్చినట్టయితే మేలు కలుగుతుందని శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు. ఇక్కడికి కొద్దిదూరంలో, బృందావనం అనే ప్రదేశం ఉన్నది. ఆ కొండలూ, నదులూ, పచ్చికబయళ్లూ కనుపండువుగా వుంటాయి. పైగా, మన పశువులకు కావలసినన్ని గోభూములున్నయి. అన్ని సదుపాయాలూ గల బృదావనం వాసయోగ్యమైందనీ, మనకు క్షేమకరమైందనీ నా వుద్దేశం" అని చెప్పాడు.

ఈ ఉపాయం విని అందరూ "భేష్! భేష్!!" అని పొంగిపోయారు. ఆ వెంటనే గోకులంలో ఉండే బళ్లన్నీ సిద్ధమైనయి. పిల్లలూ, వృద్ధులూ, ఆడవాళ్ళూ బళ్లెక్కారు. మరికొన్ని బళ్లలో సామానులు నింపారు. భజనలతో బాజా భజంత్రీలతో, హరినామస్మరణ చేసుకొంటూ గోపులు, గోపికలతోపహా, గోకుల ప్రజలు బృందావనానికి బయలుదేరారు.





సంపుటి 5
సంచిక 1

సంచాలకుడు: చక్రపాణి

జూలై
1949


## పాపాయిలూ!

క్రిందటిసారి నేను కోరినదానికి మీదగ్గరనుంచి చాలా పుత్సాహకరమైన జవాబులు వచ్చినై. కొంతమంది ఇద్దరూ, కొంతమంది ముగ్గురూ, కొంతమంది అయిదుగురి వరకూ చందమామను చదువుతున్నామని వ్రాశారు. ఇది చాలా ఆనందం కలిగించింది మాకు. కాని, కొంతమంది హరిజనులు తమకు చందమామ దొరకటం లేదనీ, వాళ్ళ స్కూళ్లుకూడా తెప్పించటం లేదనీ వ్రాశారు. అయితే దీనికి మేము చేయగలిగింది చేస్తాము.

ఈలోపల హరిజనులకు, బీదలకు మాత్రం చందమామ రు. **4-0-0** చందా చేశాము. కాబట్టి చందాదారులుగా చేరదలచిన బీదవారు జూలై నెలాఖరులోగా చేరవలసింది. ఆ పైన ఈ చందాకు చేర్చుకోము.

—మీ చందమామ




తల్లి
బుజబుజ రేకుల బుజ్జోడా!
పొగ త్రాగిన చెడిపోతావు.

కొడుకు
నాతో నీతులు చెప్తావే!
తాత త్రాగడ మ్మెందులకే?

తల్లి
పెద్దలకే బుద్ధుంటేగా
పిల్లలు చెడిపో కుంటారు!—
ముక్క నేర్చుకోకుంటావా?
మొద్దబ్బా యంటారయ్యా!

కొడుకు
నీ కస లచ్చరమే రాదే!
నాకేవో తెగ చెప్తావు?

తల్లి
కాబట్టే నల్వురు నన్నూ
గూబ పట్టు కాడిస్తారు.

అడ్డమైనవీ తింటావా?
ఆరోగ్యము చెడిపోతుంది!—

కొడుకు
తినకుంటే కొడు తుంటావు,
తింటే జబ్బం టుంటావు.

తల్లి
పెట్టినదేదో తింటేగా,
కొట్టక తిట్టక మానేది
పైసా చేతికి దొరకిందా
బ్రతకనీయు వెట్లాగయ్యా!—

కొడుకు
ఖర్చు పెట్టుకో డానికెగా
కానీ సంపాదించేది?

తల్లి
కానీ సంపాదిస్తే యా
గాని ఖర్చె ట్టాలోయీ!

రచన: 'ఏటుకూరి'

పరిశుభ్రంగా నుంటావా
పదుగురు దొరబిడ్డంటారు !—

కొడుకు

మ్రింగను మెదుకులు లేకుంటే
మీసాలకు సంపగినూనా ?

తల్లి

ఉన్నదానితో ముత్తెములా
గుండే వారెందఱులేరు ।
అబద్ధ మాడకు మెప్పుడదే
అలవాటై చెడిపోతావు !—

కొడుకు

ప్రొద్దున లేస్తే నిజానికి
పెద్దలు చేసే దదేకదా ?

తల్లి

పరులసొత్తు ముసి ముట్టితివా ?
పచ్చెపు దొంగం టా ?య్యా !

కొడుకు

తిననిది త్రేపని దెవరమ్మా !
తిరిసి గడించిం దెవరమ్మా !

తల్లి

పెద్దలమాటలు మీఱితివా ?
హద్దులేనివా డంటారు.

కొడుకు

గోడమీద నిలబెడితే నే
గూడ పెద్దవాడను గానా ?

తల్లి

మాటలు నేర్చిన కుక్కవు నిన్
వేటకు బంపిన బాగుండు.

కొడుకు

ఇస్కంటే దస్కంటానే
ఎవరే తక్కువ దినువారు ?



# గొడుగు

పూర్వం జమదగ్ని అని ఒక మహఋషి ఉండేవాడు. తక్కిన ఋషులలాగ అయన తపశ్శాలిమాత్రమే కాదు. విలువిద్యలో గొప్పనేర్పరి. ఆయన భార్య పేరు రేణుక.

జమదగ్నికి ఒక సరదా వుండేది. తన ఆశ్రమానికి దగ్గిరవున్న ఒక పెద్ద మైదానంలో ప్రతిరోజూ అయన కూర్చోవటం; కూర్చుని, అంబులపొదినించి బాణాలు తీసి వదలటం; ఆయన విడిచిన బాణాలను రేణుక తెచ్చి అందిస్తూవుండటం.

ఒకనాడు జమదగ్ని మామూలుగా బాణాలు వదులుతూ వున్నాడు. వాటిని తీసుకరావటానికని రేణుక వెళ్లింది కాని, జామున్నర పొద్దెక్కినా తిరిగి రానేలేదు. ఎంతసేపు కనిపెట్టుకొనివున్నా తన ప్రియమైన రేణుక రాకపోయేసరికి, జమదగ్నికి మనస్సులో ఆత్రం కలిగింది. ఆయన తన దివ్యదృష్టివల్ల రేణుక ఎండలో పైన నెత్తీ, కింద పాదాలూ కాలుతూ నెమ్మదిగా రావటం కనిపెట్టాడు.

మహఋషి ఉగ్రుడైనాడు. "అవురా, ఈ సూర్యునికి ఎంత పొగరు! నారేణుకకు కష్టం కలిగిస్తాడా? ఏమనుకొన్నాడో యేమో! ఇంకా నా సంగతి తెలియదు కాబోలు" అంటూ సూర్యభగవానునివేపు తీవ్రమయిన బాణం సంధించాడు.

మహఋషి కోపం చూచి, సూర్యభగవానుడు ఒక బ్రాహ్మడి రూపంతో భూలోకానికి దిగివచ్చి జమదగ్ని ఎదట నిలబడి, "మహాత్మా! కర్మసాక్షి అయిన ఆ సూర్యుణ్ణే సంహరించబోతున్నారేమిటి? ఆయనవల్లనేకదా లోకాలు సక్రమంగా నడుస్తున్నవి? సూర్యుడే లేనినాడు ఇక ప్రపంచమెక్కడిది? అన్నీ తెలిసిన తమరే ఇలా క్రోధం పూనవచ్చా?" అనిఅడిగాడు.

పి. మాధవరావు, చిత్తూరు

# చెప్పులు



అందుకు జమదగ్ని "బ్రాహ్మణోత్తమా! ఈవిషయము మీకేమీ తెలియదు. ప్రియమయిన నా సతీమణికి అతను ఎంత అయాసము కలిగించాడో మీకేమి తెలుసు? ఏమైనాసరే, ఆ దుర్మార్గుణ్ని భస్మముచేసి తీరతాను. మీరు తప్పుకోండి" అన్నాడు.

అప్పుడు, బ్రాహ్మడి రూపంలో ఉన్న భానుడు 'మునీంద్రా! రహస్యమెందుకు? నేనే సూర్యుడను. నీ ప్రియసతికి అయాసం కలిగించినందుకు మన్నించవలసింది' అని ప్రార్థించాడు.

భానుడు ఇలా అనేసరికి, జమదగ్ని కోపం ఎక్కడిదక్కడనే ఎగిరిపోయింది. ఆయన సూర్యుణ్ని దగ్గరకు తీసుకొని, ఆదరించి, "భానుడా! బలేవాడివయ్యా. నా రేణుక చూడు, ఎంత అలిసిపోయిందో! ఆమె శిరస్సు ఉడికిపోయింది. పాదాలు బొబ్బలెక్కినయి. శరీరమంతా కమిలిపోయింది. ఆమె తాళలేనంత ఎండ కాయించావుకదా, మరి. ఎవరికి కోపం రాదు నీవే చెప్పు" అని మందలించాడు.

అప్పుడు భానుడు మందహాసంతో 'గొడుగు,' 'చెప్పులు' అనే రెండు వస్తువులను కల్పించి మునీంద్రునికిచ్చి "మహాత్మా! ఇవి అపూర్వమయిన వస్తువులు. ఇప్పటివరకు మూడు లోకాలలో కూడ ఇవి లేవు. తల్లి అయినటువంటి రేణుకాదేవికోసం వీటిని సృష్టించాను. ఈ చెప్పులు తొడుగుకొన్నట్టయితే పాదాలకు నా వేడి తాకదు. తలపయిన ఈ గొడుగు వేసికొన్నట్టయితే వంటికి నా కిరణాలు తగలవు. వీటిని ఉపయోగిస్తే నా వేడివల్ల బాధకలగదు" అనిచెప్పి, వెళ్ళిపోయాడు.

అది మొదలు భూలోకంలో గొడుగూ, చెప్పులూ వాడుకొంటూ, మానవులు ఎంత బాధ లేకండా సుఖంగా వుంటున్నారు.




తొందరపడి ఏపనియును చేయరాదుసుండి,
తొందరపడితే ఏమగు? మందపాలుగతియగు!
మందపాలు డేవిధముగ తొందరపడె? అందులకే
చందమయ్యె నాతనిగతి? విందామని ఆశకదూ!
మందపాలునకు కలదొక అందమైన పసికందు;
చందమామవంటి పాప! అమ్మలేదు ఆ పాపకు!
నాన్న మందపాలుండే అమ్మ, నాన్న, ఆ పాపకు!
నాన్న ఇంట లేనప్పుడు పాపకెవరు కాపలా?
లిల్లీ అను ఒక చక్కని నల్లకుక్క కాపలా!
తల్లిలాగ ఆ పాపకు లిల్లీయే కాపలా!

* * *

పాప నాన్నగారు మందపాలుడుగా రొకనాడు
ఏపనిమీదో ఏపొరుగూరో పోవలసివచ్చె!
బొజ్జనిండ పాపాయికి పాలు త్రావనిచ్చి
ముద్దుపెట్టి ఉయ్యాలలో బజ్జోకొట్టి,
రొట్టె ముక్కముక్కలుగా లిల్లికి తినబెట్టి,
'పాప భద్ర' మని లిల్లిని బాగ వీపు దువ్వి
పదిగంటల పగటివేళ బారెడుప్రొద్దెక్క
పాపనాన్న పొరుగూరికి బయలుదేరిపోయె!
నాన్న ఊరలేనప్పుడు పాపకెవరు కాపలా?
లిల్లీయే ఆ పాపకు తల్లిలాగ కాపలా!

రచన: 'జేజిమామయ్య'

పొరుగూరికి పనికోసము పోయినట్టి నాన్నగారు
ప్రొద్దుగ్రుంకువేళకు పనితీరగ ఇంటికి వచ్చెను.
ముంగిట అడుగిడినంతనె పొంగిపోవు విశ్వాసము
పొరలుచున్నదనగ లిల్లి త్వరత్వర తోకాడించును
రబ్బరువలె వంగిపోయి సాగిపోయి గంతులిడును,
ముందాగును, కొనిపోవును, నాన్నకాళ్లు తెగనాకును
కుఁయికుఁయికుఁయికుఁయిమనుచూ నాన్నమొగము తెగ చూచును
"ఏమిదేమి? ఈ ఘోరము! ఈరక్తము ఒంటినిండ?
ఇంటినిండ రక్తముతో ఒంటినిండ రక్తముతో
ఎదురుపడినదేమిలిల్లి?" అని నాన్నకు దిగులుకలిగె!
పాపాయికి ఏమాయెనొ పాలుపోవలేదు తనకు!
పాపాయేడని ఉయ్యాలమంచమ్మును చూడబోయె!
మంచము బోరగిలనుండె పరుపుదూరముగ పడుండె!
క్రిందమీద నలుపక్కల ఇల్లంతా రక్తమయమె!
మందపాలుకాలునాకి పరుపువైపు సాగు లిల్లి!
ఒళ్లంతా రక్తమైన లిల్లిచూచి ఇల్లు చూచి,
బుల్లిపాప కేమాయెనొ పాలుపోని నాన్న అపుడు
ఒళ్లు భగ్గుమనుచు మండి ఒక్క కేక వేసెనపుడు!—
"పాపాయిని చంపావా పాపిష్టీ–కుక్కా" అని



పొడిచె బాకుతోడ లిల్లి కడుపుదూసుకొనిపోవగ!
'కుయ్యో' అని లిల్లీ ఒక కెకపెట్టి మూలుగుచూ
పరుపుతల్లక్రిందులుగా పడిఉన్నాచోట వ్రాలె!
పరుపుక్రింద వినిపించెను పాపగొంతు కేరింతలు!
పరుగులోన నాన్నవ్రాలి పరుపు ఒత్తిగించిచూడ
పరుపుక్రింద భద్రముగా పాపనవ్వుచూ పరుండె;
ప్రక్కనె పడియుండె ముక్కముక్కలుతెగి ఒక్కనక్క!

*　　　*　　　*

నాన్న ఊరలేనప్పుడు పాపకాపలాలిల్లీ
నక్కతోడ పోరుసల్పి ముక్కముక్కలుగ చంపెను.
నాన్నపాదములునాకుచు, తన్నుకొనుచు విలవిలమని,
కుయ్యో అని దీనముగా కూతపెట్టి బాధపడుచు
పాపాయిప్రాణము కాపాడుటకై పోరిపోరి
నక్కనుచంపినలిల్లీ చుక్కలలో చేరిపోయె!
మందపాలుడయ్యో అని, బారుబారుమని యేడ్చెను!
నాన్న ఊర లేనప్పుడు పాపకెవరు కాపలా?
తల్లిలాగ ఆ పాపకి లిల్లికూడ లేదుగా!
తొందరపడి ఏపనియును చేయరాదుసుండి!
తొందరపడితే ఏమగు? మందపాలుగతియగు!






పానుగంటి పట్టణం వదిలి అడివిమార్గం గుండా బాలుడు పగలల్లా నడిచాడు. ఎనిమిదామడ నడిచినా ఎక్కడా ఒక ఊరు తగలలేదు. చీకటిపడిపోయింది. వెంట తెచ్చుకున్న అన్నం తినేసి బాలుడు ఒక మర్రిచెట్టుకింద కంబళి పరచుకొని నిద్రపోయినాడు. అతను తెల్లవారి నిద్రలేచే సరికి పన్నెండు శిరస్సులుగల నాగరాజు తలదగ్గిర పడగలువిప్పి కనుపించాడు. సర్పరాజు తనకు అపకారం చెయ్యటానికి వచ్చాడనుకుని బాలుడు చంద్రాయుధం దూశాడుకాని ఎత్తినచెయ్యి ఎత్తినట్టేఉంది.

బాలుడితో నాగరాజు ఇలా చెప్పాడు :

"బాలవద్దిరాజా, మీతల్లి బాలనాగమ్మ మా నాగేంద్రుడి వరాన పుట్టింది. కనుక నువు నా మనమడవు. నువు మీ తల్లిని తీసుకొస్తావు. నీ చేతిలో మాయలఫకీరుకు చావున్నది. కాని నీకొక చిన్న గండం ఉంది. నాగళ్ళపూడి గట్టున ఫకీరు ఒక శక్తిని కావలిపెట్టాడు. అది మాయవేషం వేసుకుని తక్కుతూ, తారుతూ నీ దగ్గిరికి వస్తుంది. దానిమాయలో పడకు. జాగ్రత్త."

ఈ మాటలు విని బాలవద్దిరాజు నాగరాజుకు సాష్టాంగపడి ఆశీర్వాదం పొందాడు. ఆ పగలల్లా నడిచి అతను పులిరాజుపట్నం చేరుకుని పొద్దుకూకే వేళకు పూటకూళ్ల పెద్దమ్మ ఇంటికెళ్లాడు.

బాలుడు అన్నం నీళ్లూ లేకుండా చాలా దూరంనుంచి వచ్చాడని పూటకూళ్ల పెద్దమ్మ చప్పున పొయ్యి రాజేసి నాలుగు కూరలు తరిగి వంట ఆరంభించింది.

"ఏమిటవ్వా, ఈ ఊళ్లో విశేషాలూ?" అన్నాడు బాలుడు.

"విశేషాలేమున్నాయి, నాయనా? మంచినీరు ముట్టి 'ఆరునెల్లయిందిగదా!" అన్నది పూటకూళ్ళ పెద్దమ్మ.



"అదేం, పెద్దమ్మా?"

"తాగటానికీ ఉప్పునీళ్లే, వంటకీ ఉప్పు నీళ్లే, పప్పుడక్క చస్తున్నామంటే నమ్ము."

"మీ ఊరికి మంచినీళ్ళ బావి లేదా?"

"ఉంటే ఏం లాభం, నాయనా? మా ప్రాణంమీదికి పులి ఒకటి దాపరించెగా?"

"చెప్పవూ? ఎక్కడుందా పులి?"

"నువు వినలేదు గామాలు. మావూరి కోట ఉత్తరపు గోడ అవతల మంచినీళ్ళ బావిదగ్గర చేరింది ఒక పాపిష్టి పులి. ఆరు నెల్లనుంచీ అటుకేసి వెళ్లినవారి నందర్నీ చంపుకు తింటున్నది. దాన్ని చంపటం ఎవరివల్లా కాలేదు." అన్నది పెద్దమ్మ.

"మీ ఊరి రాజుగా రేంచేస్తున్నారు?"

"ఏం చేస్తారు? పద్దెనిమిది కులాల వాళ్ళలో ఎవరు పులిని చంపినా తన కూతుర్నిచ్చి పెళ్లి చేస్తానని చాటించారు. మూడుమూరల కాగితంమీద అదే రాయించి నడివీధిలో అంటించారు. కాని పులినిచంపే నాధుడేడీ?"

బాలుడు భోంచేసి పడుకున్నాడు. తెల్లవారే లేచి స్నానంచేసి, చద్దిఅన్నం తిని రత్నకంబళి పైన వేసుకుని బయలు దేరి, ఉత్తరపు దరవాజా దగ్గిరికివచ్చాడు. దరవాజా తాళంవేసిఉంది గాని అక్కడ కాపలావాళ్లున్నారు. "ఎవరోయ్? ఈ తలుపు తాళం వేశారేం? తియ్యండి. నే నిటు వెళ్లాలి," అన్నాడు బాలుడు.

"ఇటు నడవటం మానేశారు. తూర్పు దరవాజాకుండాపో" అన్నారు కాపలావాళ్లు.

"నే నిటే పోవాలి." అన్నాడు బాలుడు.

"అబ్బాయీ, ఉన్నమాట చెప్పకపోతే మాకు పాపం చుట్టుకుంటుంది. ఇక్కడకు దగ్గిరిగా మంచినీటి బావిదగ్గిర పెద్ద పులి ఉంది. అందిన వాణ్ణల్లా చంపుకు తింటుంది," అన్నారు కాపలావాళ్లు.

"ఏదీ? ఆ పులిని ఒకసారి చూద్దాం, తలుపులుతెరవండి", అన్నాడు బాలుడు.

కాపలావాళ్ళు తలుపులు తెరిచి, బాల వద్దిరాజును బయటికి పోనిచ్చి మళ్ళీ తలుపులకు తాళాలు పెట్టారు.

బాలవద్దిరాజు పులిని వెతుక్కుంటూ మంచినీళ్ల బావి దగ్గిరికి వెళ్లాడు. పులి ఆహారం వెతుక్కుంటూ వస్తూ బాలుణ్ణి చూసి గాండ్రిస్తూ మీదకు దూకింది. బాలుడు చంద్రాయుధం దూసి దాని కుత్తుకలో పొడిచేశాడు. పులి వెల్లికిలాపడి చన్నుకు చచ్చింది. బాలుడు దాని కాళ్ళ గోళ్లూ, తోక చివరభాగమూ కోసుకుని తూర్పు దర్వాజాగుండా పట్నం ప్రవేశించి పూటకూళ్ల పెద్దమ్మ ఇంటికి తిరిగొచ్చాడు.

"ఎక్కడికి పోయినావు, నాయనా?" అన్నది పెద్దమ్మ.

"పట్నం చూడబోయినాను. ఎంత చూసినా తనివి తీరటం లేదు. ఒకటి రెండు రోజులుండిగాని పోను!" అన్నాడు.

ఇది ఇట్లా ఉండగా ఆ పట్టణంలో తిప్పడనే చాకలి ఒకడున్నాడు. వాడు వట్టి పనికిమాలిన వెధవ. మూడునెల్లకొకసారైనా బట్టలకు వెళ్లేవాడు కాడు. ఎప్పుడూ తప్ప తాగి ఒళ్లు తెలియకుండా ఉండేవాడు.

ఇవాళ వాడు యథాప్రకారం తప్పతాగి మళ్లీ ఊళ్లోకి వస్తూ, ఎటుపోతున్నదీ తెలీక మంచినీళ్ల బావిదగ్గిరికి వచ్చాడు. అక్కడ





దారికడ్డంగా పులి కనిపించింది. ఆ నిషాలో వాడికి భయంకూడా కలగలేదు. చేతిలో ఉన్న దుడ్డుకఱ్ర ఎత్తి దబాదబా నాలుగు బాదాడు. పులి కదల్లేదు, మెదల్లేదు. తొంగి చూశాడు. చచ్చినట్టు కనిపించింది. కాలితో తన్ని చూశాడు. నిజంగా చచ్చింది.

తిప్పడు "నా రంగా. రాజుకూతుర్ని పెళ్లాడతా గామాలె! రాజునౌతా గామాలె! అంతా నా కాళ్లకాడ మొక్కుతారు గామాలె!" అనుకుని రాజుగారి ఆస్థానానికి పరిగెత్తసాగాడు. దారిలో అందరూ వాణ్ణి చూసి ఆశ్చర్యపడ్డారు. ఎవరైనా వాణ్ణి అడ్డం తగిలి పలకరిస్తే వాళ్లని ఒక్కతోపు తోసి పరిగెత్తుతూ దివాణం చేరాడు. రాజుగారిదగ్గిర సాష్టాంగపడి, "మహాప్రభూ, నేను మంచినీళ్ళ బావికాడ ఉన్న పులిని చంపేశాను. కావలిస్తే శవాన్ని పరీక్ష చేసి నాకు తమ కూతుర్ని ఇచ్చి వివాహం చేయించండి" అన్నాడు.

రాజుగారూ, రాజబంధువులూ కూడా ఈ వార్త విని నిర్ఘాంతపోయినారు. మహామహావాళ్లు చంపలేక పోయిన పులిని ఈ తాగుబోతు చంపుతాడని ఎవరనుకొంటారు? రాజుగారికూతుర్ని తిప్పడికిచ్చి చెయ్యటం ఎట్లా? ఆడినమాట తప్పటం ఎట్లా?

'రాజుగారి మనుషులు వెళ్లి చచ్చిపోయిన పెద్దపులిని పరీక్షించారు. పులి చచ్చినమాట నిజమేనని తేలింది. చాకలి తిప్పడు పులిని చంపాడు కనక, మంచి ముహూర్తం చూసి వాడికి రాజుగారి కూతురు సుభద్రాదేవిని ఇచ్చి పెళ్లి చేస్తామని రాజుగారు చాటింపించాడు.

రాజుగారింట ఎవరిముఖానా ఆనందం లేదు. సంబరమంతా చాకలి తిప్పడిది. వాడు తన పెళ్ళాన్ని చావచితకగొట్టి తన బంధువులనందర్నీ పిలిచి అందరికీ కల్లు పోయించి అప్పుడే ఒక దర్బారు చేసి తెల్లవార్లూ ఉత్సవం చేసుకున్నాడు.



ఇక్కడ పూటకూళ్ళ పెద్దమ్మ ఇంటో బాలవద్దిరాజు భోజనం చేసి అలిసిపోయి నిద్రపోయినాడు. పూటకూళ్ళమ్మకు ఏదో అనుమానం తగిలింది. బాలుడు ఏదో చేసి వచ్చాడని ఆమెకు సందేహం కలిగింది. ఇంతలో చాకలి తిప్పడు పులిని చంపాడన్న చాటింపు వినపడింది. బాలుడు నిద్రపోతుండగా పూటకూళ్లమ్మ అతని చంద్రాయుధం తీసి పరీక్ష చేసింది. పూటకూళ్లమ్మ సందేహం జాస్తి అయింది. ఇంతలో పులిగోళ్ళ మూట ఆమె కంట పడింది. విప్పి చూస్తే అందులో పులిగోళ్లూ పులి తోక ముక్కా కనిపించాయి. అర్ధరాత్రివేళ పూటకూళ్ళమ్మ ఈ సాక్ష్యం పట్టుకుని రాజుగారి దివాణానికి వెళ్ళింది.

తెల్లవారేసరికల్లా తిప్పడి ఇంటికి రాజభటులు వచ్చి వాణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి జైలుకు తీసుకుపోయినారు. అదే సమయంలో పూటకూళ్ల పెద్దమ్మ ఇంటికి రాజుగారు పల్లకీ ఎక్కివచ్చి బాలవద్దిరాజును ఎక్కించుకుని తన నగరుకు పోయి సకల మర్యాదలూ జరిపాడు.

పులిరాజు తనకు సుభద్రనిచ్చి పెళ్ళి చెయ్యటానికి ప్రయత్నాలు చేస్తున్నాడని తెలియగానే బాలవద్దిరాజు, "నేను మా తల్లిని చెరవిడిపించ బోతున్నాను. అందుచేత ఇప్పుడు పెళ్లి చేసుకోవటం భావ్యం కాదు. మా అమ్మతో సహా తిరిగివచ్చేటప్పుడు ఇక్కడ ఆగి పెళ్లి చేసుకుని మా వూరు పోతాను," అన్నాడు.

బాలుడు చెప్పినదానికి పులిరాజు సరేనని నాగంభొట్లనే బ్రాహ్మణుణ్ణి తోడిచ్చి పంపాడు. పులిరాజుపట్నానికీ, గంగవాడి పట్నానికీ పన్నెండామడ దూరం. రెండు జాములు పొద్దెక్కేవరకూ ఇద్దరూ నడిచారు. బాలుడికి దాహమయింది. బ్రాహ్మడు బావి చూపిస్తాను రమ్మని



పక్కదారి పట్టించి, ఒక పాడుపడిన నూతి దగ్గిరికి తీసుకుపోయినాడు. ఆ బావిలో నీరు లోతుగా ఉంది. లోపలిపక్కల రేగు పొదలున్నాయి. నీరు చేదుకునేటందుకు చేదలేదు. అందుచేత నడుముకి బాలవద్ది రాజు పాగా చుట్టుకుని ముందుగా బ్రాహ్మణుడు బావిలో దిగి నీరుతాగి పైకి వచ్చాడు.

పైకి వచ్చిన బ్రాహ్మణుడు, "అబ్బాయీ, బావి చాలా లోతుగా ఉన్నది. నిలువునా రేగుకంపలున్నాయి. నీ నగలూ, కత్తీ తీసిపెట్టి దిగు. లేకపోతే నిష్కారణంగా కంపలకు చిక్కుకుని నీటిలో పడిపోతాయి." అని చెప్పాడు. బాలుడు బ్రాహ్మడి మాటలు నమ్మి తన నగలూ, కత్తీ తీసి ఒడ్డున పెట్టి, నడుముకు పాగా చుట్టుకుని బావిలోకి దిగాడు. బాలుడు బావిలో దిగిందే వ్యవధానంగా బ్రాహ్మడు కత్తితో పాగా కోసి, బాలుడి నగలూ కత్తీ అపహరించి, గంగవాదిపట్నం వెళ్లి, ఆ నగలు భోగంవాళ్లకిచ్చి విలాసంగా తిరగసాగాడు.

కొంతకాలానికి బ్రాహ్మడిదగ్గిర డబ్బాయి పోయింది. ఎవరూ దగ్గిరికి చేరనివ్వలేదు. పొట్ట పోసుకోవటానికి గోపాలస్వామివారి గుడిపక్క రథం దగ్గిర చేరి యాచన ఆరంభించాడు.

ఇక్కడ నాగంభొట్లు పాగా కోసెయ్యగా నీటిలో పడిపోయిన బాలవద్దిరాజు నిద్రాహారాలు లేకుండా ఆ బావిలో చాలా కాలం ఉన్నాడు. ఎన్ని కేకలు పెట్టినా ఆ కీకారణ్యంలో ఆలకించేవారు లేరు. ఇంతలో ఒకనాడు గంగవాదిపట్నం రాజు అడవికి వేటకు పోయి, వేటకుక్కలకు నీరు పెట్టటానికిగాను ఈ పాడుబడ్డ బావిదగ్గిరికి పరివారంతోకూడా వచ్చాడు. రాజుగారి నౌకర్లు చెంబుకు పాగా కట్టి నూతిలో వెయ్యగానే బాలుడు ఆ పాగా పట్టుకున్నాడు. చెంబు

పైకి లాగేటప్పుడు చాలా బరువుగా వుండటం చూసి నౌకర్లు చాలా ఆశ్చర్య పడ్డారు. వాళ్లధర్మాన బాలవద్దిరాజు ప్రాణాలతో బయటపడ్డాడు.

అతన్ని గంగవాదిరాజు తన ఊరికి తీసుకుపోయి అతని సమాచారమంతా అడిగాడు. బాలుడు అన్ని విషయాలూ చెప్పి, తాను పులిరాజుపట్నంనుంచి వస్తూ సుడిగాలికి బావిలో పడ్డానని చెప్పాడు. గంగవాదిరాజు బాలుడికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేస్తానన్నాడు. అందుకు బాలుడు తన తల్లిని మాయలఫకీరు చెర విడిపించనిదే పెళ్లాడననీ, తల్లితో తిరిగి వచ్చేటప్పుడు పెళ్ళాడుతాననీ చెప్పాడు. రాజుగారు సరేనన్నాడు.

ఒకనాడు రాజుగారు బాలవద్దిరాజుకు గోపాలస్వామివారి గుడి చూపించటానికి తీసుకువెళ్ళాడు. అక్కడ రథం దగ్గిర కూర్చుని ఉన్న బ్రాహ్మణ్ణి చూసి బాలుడు "నమస్కారమయ్యా, నాగంభొట్లూ," అన్నాడు. బ్రాహ్మడి మొహాన కత్తి వేస్తే నెత్తురుచుక్క లేదు.

బాలవద్దిరాజు రాజుతో చెప్పి ఆ బ్రాహ్మడికి చాలా సహాయం చేయించాడు. మర్నాడు బాలుడు రాజుగారిచ్చిన కానుకలు పుచ్చుకొని మళ్లా బయలుదేరాడు. రోజల్లా నడిచాడు. చిలుకవాదిపట్టణం రెండుకోసు లుండనగా చీకటి పడిపోయింది. చీకటిలో కాలు సాగక బాలుడు అక్కడే ఉన్న ఒక పాడుదేవళంలో పడుకున్నాడు. కాని ఆకలి దహించుకుపోతూ ఉండటంచేత అతనికి నిద్ర పట్టలేదు.

ఒక రాత్రివేళ ఒక నక్కా, పులీ దేవళం దగ్గిర చేరి కబుర్లు చెప్పుకో సాగాయి. బాలవద్దిరాజు వాటి సంభాషణ వింటున్నాడు. [ఇంకా వుంది]






పూర్వం ఓ హరిదాసుగారుండేవారు. ఆయన ఓ మద్దెలవాయించేవాణ్ణీ, ఫిడేలు వాయించేవాణ్ణీ జట్టుగా వెంటబెట్టుకుని, ఊరూరా హరికథలు చెప్పేవాడు. ఓ గ్రామం వెళ్లి అక్కడ ఊరిపెద్ద లందరితోటీ తాము వచ్చిన సంగతి చెప్పేటప్పటికి, వాళ్లంతా ఉత్సాహంతో, ఆ దాసుగారిచేత వరసగా నలభై రాత్రిళ్లు సంపూర్ణ రామాయణం చెప్పించేటందుకు ఏర్పాటు చేశారు.

అయితే 'హరిదాసుగారికీ, ఆ వాయిద్యగాళ్లకీ, ఆ నలభై రోజులూ భోజనం ఎవరు పెట్టడం?' అనే ప్రశ్న వచ్చింది. హరికథలంటే చెవులుగోసుకునే పేరిభొట్లుగారు చటుక్కున లేచి, 'ఇదో పెద్ద ఆలోచనా? నేనీ ఊళ్ళో వుండగా దాసులు ముగ్గురూ మరోయింట విస్తరి వెయ్యటానికి ఎంత మాత్రమూ వీల్లేదు.' అని నిక్కచ్చిగా చెప్పేశాడు. ఆయన హరిదాసులంటే చూపిన గౌరవానికి ఊళ్లోవాళ్లంతా మెచ్చుకున్నారు. దాసులుకూడా సంతోషించారు.

కాని పేరిభొట్లుగారి పెళ్లాం పళ్ళమ్మకి పరాయి ఇంటికి భోజనానికి వెళ్ళటమంటే సరదా గాని ఒహళ్లని పిలిచి పెట్టడమంటే కిట్టేది కాదు. ముగ్గురు మనుష్యులకి నలభై రోజులు రెండుపూటలా వండి వడ్డించాలీ అనేటప్పటికి ఆవిడకి గుండె గుభేలుమంది. 'నేను చేయలేనూ' అంటే మొగుడు ఒప్పుకోడని, వాళ్లంతట వాళ్లే లేచిపోయే ఉపాయం ఒకటి ఆలోచించింది.

'ఈవేళ ఏం వంట చేస్తావు?' అని భొట్లు అడిగినప్పుడు, పళ్ళమ్మ 'మొట్టమొదటిరోజు గనక పిండివంటలతో పెద్ద విందు చేద్దాం. చక్కా గోధుమపిండీ, చక్కెరా, నెయ్యీ పట్టుకురండి' అంది. భొట్లు 'అనుకూల దాంపత్యమంటే ఇలా ఉండాల'ని సరుకులన్నీ పట్టించుకొచ్చాడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి – మదరాసు.



పళ్లమ్మ వంట చేస్తూంటే, భొట్లు దాసులు ముగ్గురినీ కొంచెం ముందుగానే పిలుచుకొచ్చి సావట్లో కూచోబెట్టి వంట అయేలోపున ఊసుపోవటానికని దాసుగారి చేత కొన్ని దరువులు పాడించాడు. అయన పాడుతూంటే ఈయన తాళంవేయసాగాడు.

పళ్లమ్మ తనకీ మొగుడికీ పిల్లలకి మాత్రం సరిపోయే మామూలు వంట చేసి, మొగుడితో, 'ఏమండోయ్. వంటయింది, స్నానానికి లేవచ్చు' అని చెప్పింది. ఆయన దాసుల్ని లెమ్మనిచెప్పి, మడిగట్టుకోమంటూంటే పళ్లమ్మ చటుక్కున, "అయ్యో నామతి మండా! విస్తరాకుల మాట చెప్పడం మరిచిపోయానండి!" అన్నది. 'ఐతేయేంలే 'అంటూ భొట్లుగారు, కత్తి పుచ్చుకుని ఊరిచివర కాలవవార ఉన్న అరటితోటకు బయలుదేరి వెళ్లేడు.

మొగుడుతెచ్చిన గోధుమపిండితో పళ్లమ్మ గోధుమగవ్వలు చేసి పాకం పట్టింది. కొంచెం ముద్ద మిగిల్చి ఆ పిండితో మనిషి ఆకారంలో మూడు బొమ్మలుచేసి పీటమీద కూచోపెట్టింది. పళ్లమ్మకి నలుగురు కొడుకులున్నారు. తమాషాగా కనబడుతూవున్న పిండిబొమ్మల్ని చూసి ఆ పిల్లలు, "అమ్మా, వీళ్లెవరే?" అని అడిగారు.

అప్పుడు పళ్లమ్మ సావిట్లో ఉన్న ముగ్గురు దాసులకీ వినపడేటట్లు పిల్లలతో, "ఆ మొదటాయన హరిదాసు. రెండో ఆయన మద్దిలదాసు. మూడో ఆయన ఫిడేలు దాసు"అని బొమ్మలకి పేర్లుపెట్టి చూపింది. దాసులు ముగ్గురికీ లోపలున్న బొమ్మల మాట ఏం తెలుసు? తమ మాటే ఆవిడ పిల్లలతో చెపుతోం దనుకున్నారు.

పిల్లలు మళ్లీ పిండిబొమ్మలకేసి చూపి "అమ్మా, వీళ్ల నేంచేస్తావే?" అనిఅడిగారు. "సలసలకాగిన నూనెలోపడవేసి ముగ్గుర్నీ దోరగా వేయిస్తాను" అని పళ్లమ్మ చెప్పింది.

ఆ మాటవిన్న దాసులు ముగ్గురూ, తమని అవిడ నూనెలో వేయిస్తా నంటోం దేమిటని తెల్లబోయి, ఇంకా ఏమంటుందో నని చెవులు అప్పగించి కూచున్నారు.

"వేయించిన తర్వాత, ముగ్గుర్నీ పాకం పట్టి మీకు పెడతాను!" అని మళ్లీ దాసులకు వినపడేటట్లు పిల్లలతో చెప్పింది.

పెద్దపిల్లవాడు, మొదటిబొమ్మను చూపిస్తూ, 'అమ్మా, నేను ఆ హంసదాసును తింటానే!' అన్నాడు. రెండోవాడు రెండో బొమ్మ చూపెడుతో, 'నేను మద్దెలదాసుని తింటానే!' అన్నాడు. మూడోవాడు, 'ఐతేనేను ఫిడేలుదాసుని తినేస్తానే!' అని అరిచాడు.

ఈ మాటలు వింటూన్న దాసులకి ఆ పిల్లలు తమను తినేస్తారేమోనని బెదురు పుట్టింది. వీళ్లు రాక్షసులు కాదు గదా! అని భయుం కలిగింది.

ఇంతట్లో పళ్లమ్మగారి నాలుగో కుర్రాడు, "అమ్మా, ఈ దాసుల్ని అన్నయ్యల కివ్వ వద్దే. ముగ్గుర్నీ నేనే మింగేస్తానే!" అంటూ మారాం చేశాడు. దానితో సావిట్లో ఉన్న దాసులకి అనుమానం తీరిపోయింది. అది బ్రహ్మరాక్షసి ఇల్లేఅని, అక్కడుంటే తమని వాళ్లు నిజంగా తినేస్తారనీ తారెత్తి, దాసులు




ముగ్గురూ పరుగుచ్చుకున్నారు. పక్క ఊరు చేరుకునేదాకా వాళ్లు వెనక్కితిరిగి చూడలేదు.

భొట్లుగారు విస్తరాకుల కట్టతో ఇంటికి వచ్చి 'దాసులేరే?' అని భార్యని అడిగాడు.

ఏమీ ఎరగనిదానికిమల్లే, అవిడ 'ఏం? సావిట్లో లేరా?' అని ఎదురుప్రశ్న వేసింది. వాళ్లు బయటికి వెళ్లి ఉంటారనీ, వస్తారనీ భొట్లు చాలాసేపు కనిపెట్టుకు చూశాడు. వాళ్లెప్పటికీ రాకపోవటంవల్ల ఆఖరికి తను భోజనానికి లేచాడు. ఆ దాసులు అలాత్తుగా ఎందుకు వెళ్లిపోయారో, ఎక్కడికి పోయారో భొట్లుగారికిగానీ, ఊళ్ళోవాళ్ళకిగానీ అప్పటికీ, ఇప్పటికీ తెలియనే తెలియదు.




అనగనగా ఒకరాజు. ఆ రాజుకి ఇద్దరు భార్యలు. పెద్దామెకు ఒక కూతురు. ఆ అమ్మాయి రూపవతి. ఆమె అందాన్ని గురించి విని, దేశదేశాలనించి రాజకుమారులు ఆమెను పెళ్ళాడవలెనని వచ్చేవారు. అయితే, అసూయగల చిన్నరాణి ఏదో ఒక అడ్డుపుల్ల వేసి, ఒక్క సంబంధమూ కుదరనిచ్చేదికాదు. అందుచేత, రాజకుమారి పెళ్లి నిలిచిపోయింది.

ఆ పిల్లను ఇంకా ఏడిపించాలెననే దురుద్దేశంతో. చిన్నరాణి మరొక కృత్రిమపు ఆలోచన చేసి, రాజు మనస్సుకి నచ్చేటట్టు చెప్పింది: "మన అమ్మాయికి ఎన్నో సంబంధాలు వస్తున్నయి, పోతున్నయి. కాని, ఎన్నాళ్లకూ పెళ్లి కావటం కనపడదు. ఒక లాగ చేస్తే బాగుంటుందని నాకు తోస్తున్నది. ఏమిటీ అంటే—పాతాళంలో ఒక భవనం కట్టి, మన తోటలోనించి ఆ భవనానికి మెట్లు కట్టించాలి. తోటలో జలకమాడే కొనేరున్నది చూచారా, ఆ కొనేటిలోనే మెట్లు దిగే గుమ్మం ఒకటి అమర్చాలి. గుమ్మం నీటిలోపల మునిగి వుంటుంది కనక, బ్రహ్మ రుద్రుడుకూడా భవనం ఎక్కడ వున్నదీ కనుక్కోలేడు. పోతే, అమ్మాయిని ఆ రహస్యభవనంలో ప్రవేశపెట్టి, చూడవచ్చే రాజకుమారులందరనూ ఆమెను కనిపెట్టమందాం. మూడు రోజులలో కనిపెట్టగలిగితే పెళ్ళి చేయడం, లేనిపక్షమందు తల కొట్టి గుమ్మానికి కట్టడమున్ను."

ఇది విని రాజు, "సరే, నీ ఇష్టప్రకారం ఏర్పాటు చేయించు" అన్నాడు.

త్వరత్వరగా చిన్నరాణీ ఏర్పాటులన్నీ పూర్తి చేయించింది. ఓడిపోయిన రాజకుమారుల తలలు కొట్టి కట్టడానికి వేరే ఒక మందిరంకూడా కట్టించింది. ఆ

డి. నరసింహమూర్తి, విజయవాడ

ప్రకారం చాటింపు వేయించింది. ఆ చాటింపు విన్నప్పటినించీ చాలామంది రాజకుమారులు వచ్చారు. రాజకుమారిని ఒకళ్లూ కనుక్కోలేకపోయారు. వాళ్ల తలకాయలు వరసగా మందిరపు గుమ్మానికి వేలాడకట్టించింది చిన్నరాణీ.

* * *

ఆ సమీపంలోనే మరివక రాజుకి ముగ్గురు కుమారులు. అందులో పెద్దవాడు ఒకనాడు తండ్రివద్దకు వెళ్లి, "నాయనా!- మన పొరుగురాజు కుమార్తెను రహస్య మందిరంలో వుంచి, కనుక్కొన్న వాళ్లకు ఆమెనిచ్చి పెళ్లిచేస్తామని చాటింపు వేశారు. ఆమెను కనుక్కోగలిగితే, పెళ్లీ అవుతుంది. పేరూ వస్తుంది. కనుక, పోయిరావటానికి అనుమతి తెలుపవలిసిం"దని కోరాడు.

అందుకు తండ్రి "అబ్బాయీ! ఇది చాలా ప్రమాదకరమైన పరీక్ష. ఇందులో నెగ్గి రావట మనేది ఉండనే ఉండదు. ప్రాణానికే మోసం వచ్చిన తరువాత ఇక పెళ్లేమిటి? ఇప్పటికి ఎంతోమంది రాజకుమారులు వచ్చారు. ఓడిపోవటంవల్ల వాళ్ల తలలు కొట్టి వేలాడదీశారు. అందు చేత, నువు వెళ్లడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు" అని చెప్పాడు.




ఎన్ని విధాల చెప్పినా రాజకుమారుని చెవికి ఎక్కలేదు. ఏమయినా సరేనని బయలుదేరి వెళ్లాడు. మూడురోజులూ తెగ వెతికినప్పటికీ, రాజకుమారి జాడ కనపడింది కాదు. గడువు దాటగానే తక్కిన రాజకుమారుల తలలతోపాటు అతని తలకూడా గుమ్మానికి వేలగట్టారు.

ఇతను ఎన్నాళ్లకూ ఇంటికి రాకపోవటం చూచి, చనిపోయి వుంటాడని తలిదండ్రులు నిశ్చయించుకొన్నారు. రెండవ వాడుకూడా స్వయంవరానికి పోయి వస్తానన్నాడు. తండ్రి వద్దని చెప్పినా వినక, ప్రయాణమై వెళ్లాడు. ఇతనుకూడా



పరీక్షలో నెగ్గలేకపోయేసరికి, తల కొట్టి గుమ్మానికి కట్టారు. కొన్నాళ్లు చూచి, కడసారివాడుకూడా బయలుదేరాడు.

కొడుకు లిద్దరూ చనిపోవటంవల్ల విచారంతో తండ్రి పోవద్దని మరీమరీ చెప్పాడు, కాని చిన్నవాడు ఆమాటను చెవినిపెట్టక ప్రయాణమయినాడు.

చిన్నవాడు చాలా తెలివయినవాడూ, యుక్తిపరుడున్ను. దారిలో ఒక పట్నం చేరుకొని, అక్కడ పేరుపడిన ఒక బంగారు పనివానివద్దకు వెళ్లాడు. వాని చేతికి రెండు సంచీల బంగారం ఇచ్చి, దానితో తను పట్టేటంత ఆకృతిలో ఒక అందమయిన గొర్రె విగ్రహం చేయమని చెప్పాడు.

మరునాటి ఉదయానికల్లా బంగారు గొర్రె తయారైంది. అదిచూచి చిన్నవాడు సంతోషించి, "వోయి పనివాడా! విగ్రహం చాలా బాగా వున్నది. దీనిని రాజుగారి వద్దకు తీసుకుపోయి, 'ఇది రాజకుమారికి బహుమానంగా తెచ్చానండి' అని చెప్పు" అని పనివానితో చెప్పి, ఎవళ్ళూ చూడకుండా తను ఆ విగ్రహంలో దాగాడు.

అద్భుతమయిన ఈ విగ్రహాన్ని చూచి రాజుగారు చాలా మెచ్చుకొని, పనివానికి పదివేల వరహాలు ఇచ్చారు. రాజాజ్ఞ ప్రకారం, ఆ గొర్రెను తక్షణమే రాజకుమారివుండే రహస్య మందిరానికి తీసుకుపోయి ఒక పెద్ద మేజాపయిన పెట్టారు.

ఈ అపురూప విగ్రహాన్ని చూచి ఆమె చాలా ఆనందించింది. విగ్రహానికి గల కన్నులలోనించి చిన్నవాడు రాజకుమారిని చూచిచూచి, ఆమె సౌందర్యానికి అతను మురిసిపోతున్నాడు.

రాజకుమారికోసం రోజూ భోజన సామగ్రి తెచ్చి, ఒక బల్లమీద అమర్చేవారు. విగ్రహంలోఉన్న చిన్నవాడు ఆకలికి

తాళలేక, అర్ధరాత్రివేళ బయటకువచ్చి రాజకుమారివదిలిన పదార్థాలన్నీ తినివేసి, మళ్లీ ఎప్పటిలాగా విగ్రహంలో దూరిపోయే వాడు.

ఈ చిత్రమేమిటా అని ఆమె ఆలోచించి, చివరకు ఒకరాత్రి మేలుకొని వుండేసరికి దొంగ దొరికిపోయాడు.

చిన్నవాడిని చూడగానే రాజకుమారి, అతని అందానికి అబ్బురపడిపోయింది. అతనిని తప్ప మరెవ్వరినీ పెళ్లాడనని నిశ్చయించుకొన్నది. అయితే ఈ కోరిక నెరవేరడం ఎలాగ?—

ఉపాయశాలి అయిన చిన్నవాడు ఒక పన్నాగం పన్నాడు. అతను చెప్పిన ప్రకారం, రాజకుమారి గొర్రెకాలు ఒకటి విరగగొట్టి, ఆ విగ్రహాన్ని మరమ్మత్తుకు పంపమని తండ్రికి కబురుపెట్టింది. విగ్రహాన్ని తీసుకుపోయేటప్పుడు చిన్నవాడు దానిలోపల దూరి బయటకు వచ్చేశాడు. ఈసారి బంగారు పనివానితో 'విగ్రహానికి కాలు మరమ్మతుచేసి, ఖాళీగా పంపివేయి' అని చెప్పాడు.

ఇప్పుడు రహస్య మందిరానికి దారి తెలుసుకొన్న చిన్నవాడు రాజుగారి దర్శనం



చేసి 'మీ అమ్మాయిని పెళ్లాడవచ్చాను' అని చెప్పాడు. 'చిన్నవాడా! మీ అన్నలు ఇద్దరూ వద్దంటే వినక నిష్కారణంగా చనిపోయారు. ఈ పరీక్ష ప్రమాదమైనది. వద్దు నాయనా' అని అనేక విధాల బోధించాడు. కాని చిన్నవాడు లొంగలేదు.

ఏమీ ఎరగనట్టు పచారుచేస్తూ, చిన్నవాడు తోటలోకి వెళ్లాడు. చిన్నరాణీ నీడలాగ అతనివెంట ఉంటూనే వుంది. చిన్నవాడు కొలనువద్దకు వెళ్లాడు. ఆ నీరు తోడించివేయమన్నాడు. రాణీ అతనిని ఆటంకపరుప బోయింది. కాని వీలు కాలేదు. నీరు తీసివేశారు.

'ద్వారం తెరువు' మన్నాడు చిన్నవాడు. రాణీ తెరవక తప్పిందికాదు. ఇద్దరూ మెట్లు దిగారు. ఇక రహస్య మందిరం ప్రవేశిస్తారనగా. 'అబ్బాయీ ఇక్కడేవుండు. అయిదు నిమిషాలలో వచ్చి నిన్ను తీసుకు వెళతా'నని చెప్పి రాణీ లోపలకుపోయింది.

రాణీ మళ్లీ ఒక యుక్తి పన్నింది. రాజకుమారికీ తక్కిన చెలికత్తెలకూ తేడా తెలియకుండా అందరిచేతా ఒకే మోస్తరు దుస్తులు వేయించింది. చిన్నవానివద్దకు వచ్చి, 'అబ్బాయీ! ఇందులో రాజకుమారి ఎవరో తెలుసుకోగలిగితే, ఆమెను నీకిచ్చి పెళ్లిచేస్తాము. లేకుంటే తలకొట్టి గుమ్మానికి కడతాము' అన్నది.

ఇదివరకు పరిచయమున్నది గనుక, రాజకుమారి ఫలానాఅని అతనికి తెలియనే తెలుసు. అయినా చిన్నరాణికి జవాబు చెప్పటానికి ఆమె యుక్తికి మించినయుక్తి చేశాడు. తనవద్దవున్న బంగారపు తునకలు నేలమీద విసిరాడు. చెలికత్తె లందరూ వాటిని ఏరుకోబోయారు. రాజకుమారి మాత్రం వాటికోసం ఆశపడక అలా నిలుచుకునే వున్నది. చిన్నవాడు రాజకుమారి చేయి పట్టుకున్నాడు.

ఇదంతా కనిపెట్టి చూస్తున్న రాజు చిన్నవానికీ రాజకుమారికీ పూలదండలు వేసి, దీవించాడు. చిన్నవాడి తలిదండ్రులనుకూడా రప్పించి, అతి వైభవంగా కూతురికి వివాహం చేశాడు.

రాక్షసిబుద్ధులుగల చిన్నరాణీ ఇప్పటి వరకూ మందిరానికి తొంభైతొమ్మిది తలలు కట్టింది. చిన్నవాని తలకాయ కొట్టించి తన సరదా తీర్చుకుందా మనుకున్నది. కానయితే, రాణి దుర్మార్గాన్ని గమనిస్తున్న రాజు, ఆమె తలనే నరికించి ద్వారానికి కట్టించి, నూరు పుర్రెల దండను పూర్తి చేదామనుకున్నాడు. కాని రాజకుమారుడు వినలేదు. ఆమెను రక్షించమన్నాడు.






ఒకనాడు బ్రహ్మదేవుడు ముసలివాని రూపంతో గంగానది ఒడ్డున కూర్చుని, ఆ గట్టునవుండే దర్భపోచలు పీకి ముళ్లు వేస్తున్నాడు. ఆ దోవనే పోతున్న ఒక బ్రాహ్మణ యువకుడు ముసలివాణ్ణి చూసి, "అదేమిటి తాతయ్యగారూ! మీరు చేస్తూ వున్న పని చాలా చిత్రంగా కనపడుతున్నది. ఆ గడ్డిపోచలకు ఎందుకు అలా ముడులు పెడుతున్నారు?" అని అడిగాడు.

దానికి తాత, "అబ్బాయీ. ఇవి ఉత్త ముడులు కావు; బ్రహ్మముడులు. కాశీలో వున్న పిల్లకీ, రామేశ్వరంలో ఉన్న పిల్లవాడికీ, గయలోవున్న పిల్లకీ, ద్వారకలో పిల్లవాడికీ–ఇలా ఏ పిల్లకూ ఏ పిల్లవానికీ ఘటన వుంటుందో చూచి, ఈ దర్భలతో బ్రహ్మముడులు వేస్తున్నాను" అని, పని చేసుకొంటూనే సమాధానం చెప్పాడు.

ఇదంతా యువకునికి విడ్డూర మనిపించింది. "ఏమిటయ్యా, ఎక్కడో కాశీలో పిల్లకూ రామేశ్వరంలో పిల్లవానికీ కలిపి నీ ఇష్టం వచ్చినట్టల్లా ముడివేయడమేమిటి? పైగా, ఆప్రకారంము జరిగి తీరుతుందని నమ్మమంటా వేమిటి? మరైతే, నాకు పెళ్లికాబోయే పిల్ల ఎక్కడ వున్నదో చెప్పు చూదాం" అని కవ్వించి అడిగాడు.

తాత చిరునవ్వు నవ్వుతూ, "ఇవేమీ అబద్ధాలు కావోయి. పిచ్చినాయనా!— మరి బ్రహ్మరాతంటే ఏమిటనుకొన్నావు! నేను వేసిన ఈ ముడులు తప్పిపోవడమే జరిగితే, ప్రపంచమే తలకిందులవుతుంది. కనుక, అటువంటి సంశయం ఎన్నడూ మనస్సులో పెట్టుకోకు" అని బదులు చెబుతూ, అయన తను వేసిన ముడులలో నించి రెండింటిని వెతికి తీసి, "అబ్బాయీ! హరిద్వారానికి దగ్గరగానున్న ఒకగూడెంలో

పి. భానుమతి



శ్వపచుడనే ఛండాలు డొకడు కాపుర ముంటున్నాడు. వాడి కూతురే నీకు భార్య కాబోతున్నది. ఇది దాని పూర్వజన్మ సుకృతం!" అని చెప్పి తాత మళ్లీ తన పని తను చూచుకొంటున్నాడు.

ఈ మాట వినేసరికి, యువకునికి మం డెత్తుకువచ్చింది. కోపంపట్టలేక, చిందులు తొక్కుతూ, తాతను చెడామడా తిట్టాడు. "నీ బ్రహ్మముడి యేమిటో నీ కబుర్లేమిటో చూస్తాలే నాకు మాలపిల్ల పెళ్లాం అవుతుం దంటావా, మహాఎరిగివున్నట్టు! ఏమైనా సరే, నేను బ్రాహ్మణపిల్లను చేసుకోలేక పోయినట్టయితే, నన్ను 'శర్మా' అని పేరు పెట్టి పిలవనేవద్దు..." అని మండిపడుతూ వెళ్లిపోయాడు. యువకుని తొందరపాటూ, అవివేకమూ చూచి తాత తనలో నవ్వుకొన్నాడు.

శర్మ ఇంటికి వెళ్లాడేకాని, మనస్సు స్తిమితంగా లేదు. తాత చెప్పిన మాట పయిన నమ్మకం లేదని పైకి అన్నప్పటికీ, తన పెళ్లినిగురించి ఏమి జరగబోతుందో నని అతనికి భయంగానే వున్నది.

అందుకని, అతను ఎన్నెన్నో కష్టాలుపడి రెండోకంటివానికి తెలియకుండా. హరిద్వారం చేరుకొన్నాడు. ఆ వూరిలో భోగట్టా చేయగా, సరిగా తాత చెప్పిన ప్రకారమే, మాలగూడెంలో శ్వపచుడనే వాడు ఉన్నట్టూ, వానికి ఒక ఆడపిల్ల ఉన్నట్టూ తెలియవచ్చింది.

ఇప్పుడు శర్మకు భయం మరీ ఎక్కువై ఏమీ తోచిందికాదు. 'ఇక యిది పనికాదు. ఆ పిల్లను చంపించి గంగలో పారవేయించినట్టయితే పీడ వదిలి పోతుంది. తాత రాసిన రాత తప్పి పోతుంది' అని చివరకు యోచన చేశాడు. ఆ వూరిలో వెట్టివాణ్ని రహస్యంగా పిలిచి, "ఫలానా శ్వపచుడి కూతురుని చంపివేస్తే,

నీకు గొప్ప బహుమానం ఇస్తాను" అని చెప్పాడు.

ఇటువంటి గిరాకీ తగిలినందుకు వెట్టి వాడు ఎంతో ఉత్సాహపడ్డాడు. తనకు గొప్ప బహుమానంవస్తుంది, బాగానేవుంది. కాని డబ్బుకోసం ఆశపడి, తన వూరిలో ఒక శిశువును చేతులారా చంపడమంటే మాటలా? ఇది ఒక పెద్ద సమస్య అయి కూర్చున్నది.

అప్పుడు వాడు బాగా ఆలోచించగా, తనకు బాధించని ఒక వుపాయం మనసుకి తట్టింది. శిశువు పట్టేటంత మేదరతొట్టె ఒకటి తయారుచేయించాడు. తన చాకచక్యంవల్ల, ఎవళ్ళూ లేని సమయంచూచి శ్వపచుడి యింటిలో ప్రవేశించి శిశువును ఇవతలకు తీసుకువచ్చాడు.

తరువాత మేదరతొట్టెలో ఆ పిల్లను పడుకోబెట్టి, నమ్మకంకోసమని ఆ తొట్టె శర్మకు చూపించాడు. ఆ తొట్టెనూ, శిశువునూ కనులారా చూడగానే శర్మకు ఆనందమయిపోయింది. వెట్టివాని తెలివి తేటలకు అతను చాలా మెచ్చుకున్నాడు.

"సరే అబ్బాయీ! ఇంతవరకూ నువు చేసుకువచ్చిన పని బాగానేవుంది. ఇక




ముందు జరగవలిసిన పనే కష్టసాధ్యమయింది. శిశువుతో వున్న ఈ తొట్టెను బ్రహ్మ రుద్రుడికి కూడా తెలియకుండా నదిలో వదిలేసి రావలిసింది. ఇదుగో, నీకోసం బహుమానం కనిపెట్టుకొనివుంది" అంటూ శర్మ వాడిని ప్రోత్సాహం చేశాడు.

వాడు ఉరుకులు వేసికొంటూ ఆపిల్లను నదిలో వదిలివేసివచ్చి, శర్మవద్ద తన బహుమతి పుచ్చుకుని వెళ్ళిపోయాడు. అంతటితో శర్మ, ఎంతో భారం వదిలినట్టు సంతోషించి, ఇల్లు చేరుకొని, అప్పటినించీ నిశ్చింతగా వుంటున్నాడు.

* * *



శర్మను ఒక ఇంటివాణ్ణి చెయ్యాలనే తాపత్రయంతో, అతని తలిదండ్రులు సంబంధాలకోసం వెతకసాగారు. ఓ సంబంధం కుదిరిందికూడా. కాని తీరా ముహూర్తం నిశ్చయించుదామనుకొనేసరికి పిల్ల తల్లికి ప్రాణంమీదికి వచ్చింది. అంతటితో ఆ సంబంధం పోయింది. ఆ తరవాత ఇంకోరు పిల్లనిస్తామని వచ్చారు. అంతా స్థిరపరుచుకుని పిల్లతండ్రి వాళ్ల యింటికి చేరుకోగానే హఠాత్తుగా జ్వరంవచ్చి చచ్చిపోయాడు. ఆ దెబ్బతో ఆ సంబంధం పోయింది. కొన్నాళ్లు ఎవ్వరూ రాలేదు. చివరకు, డబ్బు ఇస్తామని ఆశపెట్టి ఒక శ్రోత్రియుల కుటుంబంలోనే పిల్లను మాట్లాడుకున్నారు. కాని సుముహూర్తం వేళకు, విషపుతేలు కుట్టి, ఆ అమ్మాయి పీటలమీదనే చనిపోయింది.

అది మొదలుకుని, శర్మకు 'సుడిగాడు' అని పేరుపడిపోయింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఒక్క సంబంధంకూడా రాకుండా పోయింది. 'అయ్యో, కుర్రవానికి అసలు కల్యాణయోగమే లేదు కాబోలు' అని అతని తలిదండ్రులకు బెంగ పట్టుకుంది. ఇదంతా చూచి, శర్మకే విరక్తి కలిగింది.

ఇలా వుండగా, ఒకరోజున శర్మ తలిదండ్రులవద్ద సెలవు తీసుకొని దేశాంతరం బయలుదేరాడు. పోయి పోయి, కొన్నాళ్లకల్లా అతను కాశీపట్నం చేరుకొన్నాడు.

శర్మ కాశీలో దిగినరోజున, అక్కడ గొప్ప వర్షం కురిసి, రాత్రి కన్నూ మిన్నూ కనపడని చీకటి కమ్మివేసింది. ఒళ్లూ, బట్టలూ తడిసిపోవటంచేత, చలితో అతను ఒక పంచనుచేరి, నిలబడ్డాడు.

ఇంతలో ఇంటియజమాని భోజనమయి వాకిట్లోకి వచ్చేసరికి, శర్మ కనపడ్డాడు. అతనెవరో వాకబుచేసి, ఫలానా అని

తెలియగానే లోపలకు తీసుకువెళ్లి, మర్యాద చేసి, సదుపాయంగా భోజనం ఏర్పాటు చేశాడు.

ఇంటి యజమానికి ఒక కూతురున్నది. యుక్తవయస్సు వచ్చిన పిల్ల కావటంచేత ఆమె వివాహాన్నిగురించి అతను ఆత్రంతో ఉన్నాడు. ఇప్పుడు శర్మను చూడగానే, 'కుర్రవాడు చక్కటివాడు, అన్నివిధాలా తగిన సంబంధం. ఇది యేదో దైవికంగా తటస్థపడింది' అని ఆయనకు తోచింది.

క్రమంగా ప్రసంగంలో, పిల్లవాని కుటుంబపు భోగట్టాలూ, ఆస్తిపాస్తుల వివరాలూ అన్నీ అడిగి తెలుసుకున్నాడు. ఆయన అనుకున్నట్టుగా దేనికదే సరి పోయింది. అప్పుడు తన వుద్దేశం పిల్లవానితో చెప్పి అతని వుద్దేశం చెప్ప మన్నాడు.

పెళ్లయితే చాలునని కనిపెట్టుకునివున్న శర్మ తక్షణమే తన సమ్మతి తెలిపాడు. త్వరలోనే సుముహూర్తం పెట్టించారు. శర్మకూ, అవధానులుగారి అమ్మాయి అన్నపూర్ణకూ శాస్త్రరీత్యా వివాహం జరిగింది.

* * *



వివాహం పూర్తికాగానే, నూతన దంపతులు పెద్దలకు నమస్కరించారు. తరవాత దేవుడి పీఠంవద్దకు వెళ్లారు. దేవుని పీఠానికి పక్కనే ఒక మేదర తొట్టె వేలాడుతూ వున్నది. అది కంటపడగానే, శర్మకు గుండె గతుక్కుమన్నట్టయింది. నిజానికి, శర్మకు తొట్టెమీదనేగాని పిల్లమీద దృష్టే లేకపోయింది. "ఆ తొట్టె యేమిటండి మామగారూ!" అని అతను ఆత్రంగా అడిగాడు.

దానికి అవధాన్లుగారు, "నాయనా, శర్మా! ఆ తొట్టె సామాన్యమయింది కాదు. దేవీ ప్రసాదం. మాకు చిరకాలం




సంతతిలేక, అన్నపూర్ణాదేవికి మొక్కు కొన్నాము. ఒకనాడు దేవి మీ అత్తగారికి కలలో కనపడి, 'త్వరలోనే మీకొక ఆడ శిశువు లభిస్తుంది. ఆమెకు నా పేరు పెట్టి పెంచుకో' మని చెప్పి అంతర్ధాన మయింది. మరికొద్దిరోజులకే, నేను గంగలో స్నానం చేస్తూవుండగా ఈ తొట్టె నాదగ్గరకు కొట్టుకువచ్చింది. మూత తీసి చూచేవరకు, ఏడాది నిండని పాపాయి అందులో వున్నది. ఇదంతా ఆ దేవి అనుగ్రహమేకదా అనుకుని, వరప్రసాదంగా దొరికిన పాపాయికి దేవి పేరుపెట్టుకుని, అల్లారుముద్దుగా పెంచుకున్నాము. ఆ దేవి దయవల్లనే అప్రయత్నంగా నీవు మా ఇంటికి రావటం, మా అన్నపూర్ణను నీకు ఇచ్చి ధన్యులం కావటమూ జరిగింది. ఆనాటినించీ మేము దేవునితోపాటు ఆ తొట్టెనుకూడా పూజించటం, మా కుటుంబ ఆచారంగా పెట్టుకొన్నా" మని చెప్పాడు.

ఈ గాథ వినేసరికల్లా శర్మ మనస్సు వికలమయిపోయింది. ఈ అన్నపూర్ణ ఆకీరాలా, హరిద్వారంలోని శ్వపచుడి కూతురే అని మనస్సుకి రూఢి అయింది. అయితే, ఇప్పుడు జరిగినదానికి చేసేదేమిటీ?—

శర్మ యిక మామతో ఏమీ మాట్లాడ లేదు. భార్యవంక కన్నెత్తి చూడలేదు. యిక ఆరాత్రికి రాత్రే పిట్టకయినా తెలియకండా తన గ్రామం పోదామనిబయలు దేరాడు. తెల్లవారేలోపల దారిమధ్యని ఒక సత్రందగ్గరికి చేరుకున్నాడు. అతనికి మనస్సులో ఆ వేదనవల్ల తీవ్రమయిన జ్వరం వచ్చేసి, సంధికూడా పుట్టింది. దిక్కూ మొక్కూ లేకుండా, పాపం శర్మ, తీవ్రమయిన జ్వరంతో ఆ సత్రంలోనే మిక్కిలి బాధపడుతూ వున్నాడు.

* * *

బుద్ధికుశలత గల అన్నపూర్ణ భర్త మనస్తత్వాన్ని మొదటనే గ్రహించింది. అతనిలో కలిగినమార్పూ, వైరాగ్యభావమూ కూడా గుర్తించింది. అతనికి మనసులో ఏదో అపోహ కలగటమే ఈ విరక్తికి కారణమయివుంటుందని నిశ్చయించి, ఆ అపోహ అతని మనసులోనించి తొలగించి తీరాలని రూఢిపరుచుకొన్నది.

ఆ రాత్రి ఆమెకూడా నిద్రపోలేదు. భర్త లేచి బయలుదేరగానే అతనికి తెలియకుండా ఆమె వెంబడించింది. అతనితోపాటు ఆమెకూడా సత్రం చేరుకున్నది.

సత్రములో ప్రమాదస్థితిలో పడివున్న శర్మకు రాత్రనక పగలనక సమస్తమయిన ఉపచారాలూ చేసింది. ఆమె చేతి చలువ వల్ల త్వరలోనే అతనికి నిమ్మళించింది. తనకు ఉపచారము చేసిన పిల్ల ఫలానా అనే సంగతి శర్మకు గుర్తేలేదు. ఏమీ అంటే మామగారి యింటిలో తొట్టె కంట పడినప్పటినించీ, నిజానికి, అతనికి మతి స్తిమితం లేకనే పోయిందని చెప్పవచ్చు.

అయినా, అన్నపూర్ణ అతనికి పథ్యపానాలు అమర్చిపెట్టగా, కొన్నాళ్ళకు తేరు




కొని శర్మ మళ్లీ మనలోకంలోపడ్డాడు. ఆమె తనకు చేసిన సేవకు ఆశ్చర్యం కలిగింది. ఆమె తనను విడవకుండా పరిచర్య చేయటం చూచి, ఆమె పయిన ప్రేమ, అనురాగం ఎక్కువయినవి. ఇలాంటి పిల్ల తనకు భార్యకావటం నిజంగా అదృష్టమని భావించి, తన వుద్దేశం ఆమెకు తెలిపాడు.

ఆమె సందేహిస్తూ, 'ఇంకా మీకు పెళ్లి కాలేదా?' అని అడిగింది. దానికి శర్మ "నాకు ఇదివరకు పెళ్లయిన మాట వాస్తవమే. కాని విరక్తిభావంచేత ఆ సంబంధం వదులుకోవలిసి వచ్చింది. నాకు నచ్చిన పిల్లకోసం వెతకటానికని బయలుచేరగా

నా మనస్సులో ఉద్దేశానికి సరిగా నీవు కన పడ్డావు," అన్నాడు.

"మీకు ఎప్పుడయినా మళ్లీ విరక్తిభావం కలుగుతుందేమో. అపాటిదానికి పెళ్లి చేసుకోవడమెందుకు, విడిపోవడమెం దుకు?" అని అన్నపూర్ణ ప్రశ్నవేసింది.

అందుకు శర్మ "నేను ఎన్నడూ నిన్ను విడనాడనని ఒట్టు వేసుకొంటున్నాను. మనసు కలిసిన సంబంధానికి విడిపోవడ మెలా జరుగుతుంది!" అని ఆమెతో నమ్మ బలికాడు.

మరునాడు ఆపూరి ఆలయంలోనే వివా హానికి ఏర్పాటయింది. సూత్రధారణ జరిగే సమయాన, ఆమె మెడలో శర్మకు మంగళ సూత్రాలు కనపడే సరికి అతనిలో కోపమూ, ఆశ్చర్యమూ రెండూ ఒక్కసారిగా ఉప్పొంగినయి.

అన్నపూర్ణ అతని చేయి పట్టుకొని చిరు నవ్వుతో, "నాకూ ఇదివరకు పెళ్ళయిన మాటనిజమే. వైరాగ్యంచేత ఆ సంబంధం వదులుకోవలసి వచ్చింది. నచ్చిన వరుని కోసమని బయలుదేరాను. ఇప్పుడు నా మనస్సులో అనుకొన్న లక్షణాలన్ని మీలో కనపడ్డాయి..." అని అనేసరికి, శర్మ ఆమెను ఫలానా అని గుర్తించ గలిగాడు. జరిగిన చరిత్ర అంతా జ్ఞాపకం తెచ్చుకొని, అతను సిగ్గుపడ్డాడు. నిలకడమీద నిజా నిజాలు తెలిసినతరవాత, అతని మనస్సులో బాధ పూర్తిగా తొలగిపోయింది. అన్నపూర్ణ నిజంగా వరప్రసాదిని అని నమ్మి, ఆమెను పూర్తిగా ప్రేమించాడు. నాటినించీ ఆ దంపతులు ఎట్టి అరమరికా లేకండా చిలకా గోరింకలలాగ సంసారం నడుపు కొంటున్నారు.






పూర్వకాలమందు ఒక ఊరిలో ఒక పిల్లవాడు ఉండేవాడు. అది యేమి మహిమోకాని, అతని నోటివెంట ఏమాట వచ్చినా సరే, అక్షరాలా ఆప్రకారం జరిగి తీరేది. ఈ కారణంచేత అందరూ, ఆ పిల్లవానిని 'వాక్శుద్ధి' అని పిలిచేవాళ్లు.

ఒకరోజున, అతని చెల్లెలు 'అన్నయ్యా! తోటలోకివెళ్లి మామిడిపళ్లు కోసుకొందాము రా'అని చెప్పి తీసుకుపోయింది. చెట్టు నిండా పళ్లున్నాయి కాని, చేతికి అందటం లేదు. పోనీ పొడుగాటి కర్ర దొరుకుతుందేమోనని వాక్శుద్ధి వెతికాడు. కర్ర కనపడలేదు గాని, ఒక రాయి దొరికింది. 'భేష్, బాగున్న' దనుకుని గురిచూసి, వాక్శుద్ధి ఆ రాయి పండువేపు విసిరాడు.

పండు ఎప్పుడు కింద పడుతుందా. ఎప్పుడు తిందామా అని అతని చెల్లెలికి నోరూరిపోతున్నది. ఆమె అలా ఆత్రంతో కనిపెట్టుకొని వుండగా వాక్శుద్ధి విసిరిన రాయి గురి తప్పి ఆమె కణతకు తగిలి, ఆమె వెంటనే నేలను వాలిపోయింది. కణతనుండి బొలబొల ప్రవహిస్తున్న నెత్తురును వాక్శుద్ధి తన తువాలుతో తుడిచి, కట్టు కట్టాడు.

ఈ ఆపద సంభవించినందుకు వాక్శుద్ధి చాలా నొచ్చుకున్నాడు. ఎవరయినా దుర్మార్గులు రాయి విసిరి వుంటారేమోనని నాలుగుమూలలా కలియజూచాడు. కాని, ఆ చుట్టుపక్కల ఎవ్వరూ కనపడలేదు. తీరా రాయి తీసి చూచేసరికి, అది తను విసిరినదేకాని, పైవాళ్ళు ఎవళ్ళూ విసరలేదని తేలింది.

పోతే తను పండువేపు గురిచూచికొట్టిన రాయి, పోయిపోయి ఎక్కడనో దూరంలో ఉన్న చెల్లెలి తలకు తగలడం యేమిటి? ఇలా జరగటానికి కారణం దయ్యమా,

వై. యం. శర్మ, బాపట్ల



భూతమా, శక్తా? ఏమి టయివుంటుందీ? అని ఎన్నోవిధాల ఆలోచించాడు. ఎంత సేపటికీ ఆలోచన తోచిందికాదు. చివరకు మనసుకి కష్టంతోచి, 'ఈ శక్తి నాశనం గానూ!' అంటూ శపించాడు.

వాక్శుద్ధి నోటివెంట ఈ మాట వచ్చి రావడంతోనే, నిజంగానే ప్రపంచంలో శక్తి నశించిపోయింది.

ఇంతలో అతని చెల్లెలు కొంచెం తేరు కొన్నది. ఆమెను ఓదార్చి, మళ్లీ రాయి తీసుకుని, మామిడిపండుకి గురిచూచి కొట్టాడు. దెబ్బతో పండు టపీమని ఊడింది కాని, కింద పడలేదు. పండేకాదు, రాయీ కిందపడలేదు. రెండూకూడా ఆకాశ మార్గాన గాలిపటాలలాగ ఎగిరిపోతున్నయి.

ఈ వింత చూచి వాక్శుద్ధికి ఆశ్చర్యం కలిగింది. 'సరే, ఎంతమూరమని ఇవి అలా ఎగురుతాయి. ఎప్పటికయినా కింద పడకపోతయా? చూద్దాం' అని అనుకొని, అతను పండువెంబడే పోజొచ్చాడు. మామిడిపండు అతనికి అందకుండా, మరీ ఎత్తుగా ఎగురుతున్నది. వాక్శుద్ధికూడా పండువెంట పరుగెత్తుతూనే వున్నాడు.

ఇంకా వస్తాడు, ఇంకా వస్తాడు అని చెప్పి, అతని చెల్లెలు మామిడితోటలో కనిపెట్టుకు కూర్చుంది. కాని ఎంతసేపటికీ అన్న రాకపోయేసరికి, తను ఒక్కర్తే ఇంటికి వెళ్లిపోయింది.

మామిడిపండూ, రాయీ కీలుగుర్రాల లాగ అంతకంతకు పైకి ఎగిరిపోయి, చివరకు మాయమైపోయినయి. వాక్శుద్ధి అప్పటివరకూ వాటి వెంబడి తిరిగి తిరిగి, చేసేదిలేక, పొద్దుకుంకే వేళకు ఇల్లు చేరుకున్నాడు.

అబ్బాయికోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నది వాళ్ల అమ్మ. వాక్శుద్ధి కనబడ గానే ఆపేక్షతో, 'ఎక్కడికి పోయినావురా,

నాయనా! ఇంత అలిసిపోయావే!!' అని బుజ్జగించి, బడలిక తీరేందుకు స్నానానికి వేడినీళ్లు కాచింది. ఆమె చెంబుతో నీళ్లు ముంచి, కుమారుని తలపైన పోసింది, కాని ఒక్క చుక్కకూడా అతనితలమీద పడనే లేదు. ఆమె చెంబుతో ముంచుతున్నకొద్దీ కాగులో నీళ్లు తరిగిపోతున్నయే కాని, నీటి బొట్టుమాత్రం కొడుకు నెత్తిమీద పడలేదు.

ఇదేమిటా విడ్డూర మనుకుని, చేరెడు నీళ్లు చేతితో తీసి, చమురు రాసినట్టుగా రాసి, పోయి తుడుచుకో మన్నది ఆమె. అలాగే వేసి గోడకు తగిలించివున్న వాక్శుద్ధి తువాలు అందుకుందామని కాళ్లు పైకి ఎత్తేసరికి, గాలిలో తేలిపోయి, ఇంటి బయటికి ఎగురుకుంటూ వచ్చాడు.

ఈ చిత్రం చూచి, వాక్శుద్ధి చెల్లెలు తన నేస్తురాండ్రవద్దకు పరుగెత్తుకువెళ్లి "రండి, రండి! మా అన్నయ్య తమాషా అయిన మొగ్గలు వేస్తున్నాడు. చూదురు గాని రండి!!" అని చెప్పి, పిలుచుకు వచ్చింది. వాళ్లందరూ ఉరుకులు వేసుకొంటూ వచ్చారు. మేడపైకి ఎగిరిపోయిన వాక్శుద్ధిని చూచి, వాళ్లు నిర్ఘాంతపోయారు.



ఇంతలో వాక్శుద్ధి చెల్లెలు "అన్నయ్యా! నువు ఎలాగా మేడమీదికి ఎక్కావుకదా, అక్కడ నా బంతి చిక్కుకుపోయింది. అది తీసి ఇలా పడవెయ్యి" అన్నది. చెల్లెలుకోసమని బంతి వెతికి తీసి, కింద పడవేయబోగా, అది కింద పడక, బుడగలాగా ఆకాశంలోనే తేలుతున్నది.

కోపం కొద్దీ వాక్శుద్ధి ఆ బంతిని ఒక్క తన్ను తన్నేసరికి, కాలు జారిందో ఏమో, అతను డభేలున కిందపడ్డాడు. ఇది చూచి, ఇంట్లో అందరూ గొల్లుమని గోలచేశారు. వెంటనే డాక్టరును రప్పించారు. డాక్టరు ఇంజక్షన్ చేద్దామని మందు ఎక్కించబోతే




పిచికారి గొట్టంలోకి మందు ఎక్కలేదు. మరివొక గొట్టంతీసి చూచాడు, అందులోకీ ఎక్కలేదు. అలా ఎన్ని గొట్టాలు తెచ్చి ప్రయత్నించినా, ఒక్క గొట్టములోకికూడా మందుమాత్రం ఎక్కటంలేదు. ఇటువంటి అసందర్భం ఆయనకు ఎన్నడూ అనుభవంలో,లేదు. ఈ విధంగా కథ అడ్డం తిరగటంచూచి, డాక్టరుకే ఆశ్చర్యం కలిగింది.

చిన్నవాడు బతికే ఎత్తు లేదుకాబోలునని తలిదండ్రులు కంగారుపడుతున్నారు. ఆ సమయంలో, అక్కడ మూగిన కొంతమంది, వాక్శుద్ధికి దిష్టితీశారు;కొంతమంది మంత్రించిన విభూతి బొట్టుపెట్టారు. అలా ఎవళ్లకు తెలిసిన ప్రక్రియ వాళ్లు చేసి చూచారు. ఏ తల్లి చేతి చలవవల్లనో కొంతసేపటికి వాక్శుద్ధి తేరుకుని లేచాడు. అతను లేవగానే ఎవళ్ళ ఇళ్ళకు వాళ్లు వెళ్లిపోయారు.

మరునాటినించీ, వాక్శుద్ధివలెనే అతని స్నేహితులుకూడా ఎత్తుకి ఎగిరి, మొగ్గలు వేయటం ప్రారంభించారు. ఒకడు తాడి ఎత్తు, ఇంకొకడు నాలుగుతాళ్ళఎత్తు, మరి వకడు పదితాళ్ల ఎత్తువరకు కూడా ఎగిరి, కిందికి దిగి వచ్చారు. ఎలా ఎగురగలుగుతున్నారో వాళ్లకే తెలియటంలేదు. ఇంకొక కుర్రాడు పైకి ఎగిరి, మరి కనపడకుండా మాయమే ఐపోయాడు. వాడు ఎక్కడికి పోయాడో తెలియనే లేదు. చాలామంది భూమిపైన పాదం మోపకుండా, ఇంచుమించు గాలిలో ఈదుతున్నారు!! ఒకడు నీటిమీద నడిచాడు. ఇంకొకడు తలకిందుగా నడిచిపోతున్నాడు. ఒకటేమిటి?— ఎలా తలుచుకుంటే అలాగ, ఎక్కడికి పడితే అక్కడికి వాళ్లందరూ ఎగిరిపోతున్నారు.! పిల్లలనుచూచి పెద్దలుకూడా ఈ ఆకాశ ప్రయాణాలు ఆరంభించారు.

మొగ్గలు వేయటం, గాలిలో ఊదటం మాత్రమే కాదు. గోపాలకృష్ణుడు గోవర్ధన పర్వతాన్నీ, హనుమంతుడు సంజీవిపర్వతాన్నీ ఎత్తిపట్టినట్టు వాళ్లు బరువైన వస్తువులను ఇట్టే ఎత్తివేయగలుగుతున్నారు!!

అయితే కొన్ని ఉపయోగమైన పనులు కూడా జరుగుతూ వచ్చాయి.—వంకెలు అవసరంలేకుండా బట్టలు గోడలకు అంటుకొని ఉండటం, మేజాబల్లలు అక్కరలేకనే ఎత్తుగా వుంచిన పాత్రలు పడిపోకుండా వుండటం, ఇటువంటివి.

కాని, అంతటితో ఆగక, అనర్థాలు కొన్ని కలగడంతో, ప్రజలు జీవించటం కష్టమైపోయింది. అవిఏమిటీ అంటారా?—దాహంతో గిలగిల్లాడుతున్నవాళ్లు గుక్కెడు నీళ్లు గొంతుకలో పోసుకుందామంటే పాత్రలోనీళ్లు ఊడిపడవు. తాగటానికే నీళ్లు లేనప్పుడు ఇక వళ్లు తడుపుకోవడంమాట ఎవరు తలపెట్టగలరు? రోజురోజుకీ గాలిలో వేడి ఎక్కువ కావటంవల్ల ప్రజలకు శోష కొడుతూ వచ్చింది. ఎన్నాళ్లనూ చల్లటిగాలి తిరగకపోవటంచేత వాన కురిసే ఆశ కాస్తా అణగారిపోయింది. క్రమంగా నీటిపైన ఓడలూ, భూమిమీది బళ్లూకూడా తల



క్రిందులై బోల్తాకొట్ట నారంభించాయి. చివరకు, జనం ఊపిరి పీల్చుకోవటంకూడా కష్టమయిపోయింది.

ఈ కష్టాలను ప్రజలు భరించలేక, పెద్ద మర్రిచెట్టుకింద ఊరి పెద్దలను సమావేశపరిచారు. బుద్ధిమంతులు విచారణచేసి, దీనికంతకూ ఒక్కటే కారణమయి వుంటుందని నిశ్చయించేశారు.

అది యేమిటీ అంటే: లోగడ వాక్శుద్ధి మామిడితోటలో తన చెల్లెలి తలకు రాయి తగిలినప్పుడు, ఏదో దుష్టశక్తి ఆ పని చేసి వుంటుందని అనుకొని, 'ఈ శక్తి నాశనం గానూ!' అని శపించివున్నాడు. అతని

నోటివెంట వచ్చిన మాటకు తిరుగులేదు. కనుక ఆ శాపంవల్లనే ఇప్పుడు "శక్తి" నాశనమైపోయిందని ఊరిపెద్దలు అన్నారు.

'శక్తి యేమిటి? నాశనం కావడం యేమిటి?' అని తెలియనివాళ్లు పెద్దలను అడిగేసరికి, వారు ఇలా చెప్పారు :—

"అబ్బాయిలూ! మనం నివసిస్తూవున్న భూమికి ఆకర్షణశక్తివున్నది. అనగా ప్రతి వస్తువునూ భూమి తనవైపు లాక్కొంటుంది. ఇప్పుడు వాక్శుద్ధి శపించటంవల్ల ఆ శక్తి లేకుండాపోయింది. అది పోవటం చేతనే మనుష్యులకూ వస్తువులకూకూడా బరువులేక, ఎక్కడి వక్కడనే ఉండిపోతున్నాయి. గాలిలో బరువూ, ఒత్తిడీ లేక పోవటంచేతనే వస్తువులూ, మనుష్యులూ ఎగిరిపోవటం జరుగుతున్నది. పైగా ఇందువల్లనే ఊపిరితిత్తులలోకి గాలి ప్రసరించటం మానివేసింది" అని.

ఇదంతా విన్నతరువాత ప్రజలందరూ వాక్శుద్ధివద్దకు వెళ్లి, "నాయనా, వాక్శుద్ధీ! నీ మాటకు తిరుగులేదన్న సంగతి అందరకూ తెలుసు. నీ చెల్లెలి తలకు రాయి తగలటంవల్ల, కోపంకొద్దీ 'ఈ శక్తి నాశనం కానూ' అని నువ్వు శపించటంకూడా చాలామందికి వినిపించింది. అయితే ఆ శాపంవల్లనే ప్రపంచం ఇలా తారుమారు అయిందన్న విషయం ఎవళ్ళూ కనిపెట్టలేకపోయారు. ఇప్పుడు ఊరిపెద్దలు సభ చేసి, ఈ కష్టాలన్నిటికీ నీ శాపమే కారణమని నిశ్చయించారు. కనుక, లోకంమీద దయదలిచి, శాపాన్ని ఉపసంహరించుకోవలిసింది" అని అతనిని బతిమాలారు.

వాళ్ల కోరిక ప్రకారం అతను అలా చేయగానే, భూమికి తిరుగా ఆకర్షణశక్తి కలిగింది. ప్రపంచం మళ్లీ ఎప్పటిలాగ నడిచి, ప్రజలకు కష్టాలు తప్పిపోయినై.






అనగనగా ఒక వూరు. ఆ వూరిలో శివాలయం ఒకటి ఉండేది. ఆ గుడి పూజారి మహా భక్తుడు. అతను ప్రతిరోజూ శివలింగానికి కోటిపత్రిపూజ చేసి, పూజ చేసిన పువ్వులు రాజుగారికి ప్రసాదంగా పంపుతూ వుండేవాడు.

ఇలా వుండగా ఒకరోజున, పూజారి పొరుగూరికి వెళ్లవలసిన పని వచ్చింది. అతను బయలుదేరేటప్పుడు భార్యనిపిలిచి, "పూజా పుష్పాలు ఇవేళ రాజుగారికి నువు పంపించు. మరిచిపోకుసుమా!" అని మరిమరి చెప్పిపోయాడు.

ఆమె అప్పటికి 'అలాగే' అన్నది కాని, తీరా భర్తవెళ్లిన తరువాత ఆమాట మరిచిపోయి, రాజుగారికి పంపవలసిన పువ్వులు తన కొప్పులో పెట్టుకుంది.

సాయంకాల మయేసరికి పూజారి ఇంటికి చేరుకొని, భార్యచేసిన పొరపాటు తెలుసుకున్నాడు. కోపంతో అతను భార్య కొప్పులోని పుష్పాలను లాగివేసి, ఆమట్టునే వాటిని రాజుగారికి పంపించివేశాడు.

రాజుగారు పువ్వులు చూడగా, అందులో తలవెంట్రుకలు కనపడ్డాయి. ఆయనే పూజారిని పిలిపించి, మండిపడుతూ, 'ఇవేమిటి?' అని ప్రశ్నించారు.

పూజారికి ఏమి చెప్పటానికీ తోచలేదు. కాని, రాజు అడిగినప్పుడు ఏదో ఒక జవాబు చెప్పక తప్పదుగా? కనుక, ఆ కంగారులో అతను అప్రయత్నంగా "ప్రభూ! నేను అర్చించే శివలింగానికి వెంట్రుక లున్నయ్యండి. పువ్వులకు అవి అంటుకొన్నవి కాబోలు" అనేశాడు.

ఈమాటకు రాజు ఆశ్చర్యపడి, "మేము సాయంత్రం స్వామి దర్శనానికి వస్తాము. నువు చెప్పినట్టు శివలింగానికి వెంట్రుకలు చూపితే సరేసరి, లేకుంటే నీ తల కొట్టించి

గురుజు సత్యవతి: పాలకొల్లు

కోట గుమ్మానికి వేలాడదీయిస్తాము" అని హెచ్చరించారు.

ఆ వెంటనే పూజారి గుడిలోకి పోయి, శివలింగాన్ని గట్టిగా కౌగిలించుకొని, గాఢంగా జపం చేయసాగాడు. కొంత సేపటికి శివుడు ప్రత్యక్షమై, 'పూజారీ! ఎందుకు అలా బాధపడుతున్నావు? నీ కేమి కావాలో కోరుకో!' అన్నాడు.

అప్పుడు పూజారి "స్వామీ! ప్రభువులు అడిగిన ప్రశ్నకు అమాయికంగా, కంగారులో, నోటివెంట వచ్చినమాట జవాబుగా చెప్పివేశాను. నా తప్పు నేను తరువాత తెలుసుకొన్నాను. అందుచేత నా మాట పొల్లుకాకుండాచేసి, భక్తుణ్ణి రక్షించు. నీట ముంచినా, పాల ముంచినా నీదే భారం స్వామీ!" అని ప్రార్థించాడు. అందుకు స్వామి 'నీకేం భయంలేదు' అని చేతితో సంజ్ఞచేసి అంతర్ధానమయిపోయాడు.

సాయంకాలం రాజావారు ఆలయానికి వచ్చారు. స్వామిని నమ్ముకొనివున్న పూజారి, ఏమయితే అయిందని ధైర్యంతో రాజును శివలింగంవద్దకు తీసుకువెళ్లాడు. రాజు చూచేవరకు ఆ లింగంపైన నిజంగానే వెంట్రుకలు కనపడినై.

అయితే,—ఒకవేళ తనను మోసపుచ్చటానికి పూజారి ఆ వెంట్రుకలను అంటించివుంటాడేమోనని అనుమానపడి, రాజు ఒక వెంట్రుక పుటుక్కున లాగేసరికి, బొలబొలమని రక్తం చిమ్మింది.

కాని రాజుకి దృష్టి మందగించింది. వెంటనే, ఆయన తన తప్పిదాన్నిగుర్తించి, లింగానికి సాష్టాంగపడి 'పొరపాటు చేశాను స్వామీ! క్షమించు'మంటూ వేడుకొన్నాడు. అప్పుడు ఆయనకు మళ్లీ చూపు వచ్చేసింది. ఈశ్వరుని మహిమచూచి, రాజుకీ, పూజారికే గాక, అందరకూ ఆశ్చర్యమై పోయింది.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము

4. భూమి
5. దేహము
7. విష్ణువు
8. విషజంతువు
9. లక్ష్మి
10. గదికి ఉంటుంది
12. ఒక రంగు
13. పంచమ వేదము
16. చేపలు పట్టుటకు ఉపయోగపడును.



### నిలువు :

1. పోరు
2. దిక్కు
3. నక్షత్రము
6. పద్ధతి
9. లక్ష్మి
10. ఒక నదిపేరు
11. తండ్రి
14. సూర్యుడు
15. తపశ్శాలి
16. ఒక ధాన్యం

## ముగ్గులు



డి. పద్మాబాయి. బెంగుళూరు



ఏ. హెచ్. సుమిత్ర. గుంటూరు




# పిల్లల పెంపకం

## శుభ్రత

**పిల్లలు** మంచి అలవాట్లు చేసుకోవాలని కిందటిసారి చెప్పాము. మంచి అలవాటులలో మొట్టమొదట చెప్పవలసింది పరిశుభ్రత. దేహం పరిశుభ్రంగా వుంటే మనస్సు నిర్మలంగా వుంటుంది.

దేహం పరిశుభ్రంగా ఉండటానికి ముఖ్యంగా చేయవలిసిన పని స్నానం. స్నానం చేయటంవల్ల వంట్లో చురుకుతనం పుట్టి, ఉత్సాహంగా పనిచేయ గలుగుతాము. మెదడు బాగా పనిచేస్తుంది. అందువల్ల చక్కటి ఆలోచనలు తోస్తాయి. వంట్లో బద్ధకంగా ఉండటం, తల దిమ్ముగా వుండటం, ఆలోచన తోచక మందంగా ఉండటం—ఇటువంటి బాధలన్నీ స్నానంవల్ల తొలగిపోతయి.

స్నానమనేది ఇంత ముఖ్యమైన పని అయివుండగా, చాలామంది రోజులకొద్దీ ఒళ్లు తడపకుండా బద్ధకించి ఊరుకొంటారు. అటువంటి సోమరులు అనారోగ్యానికి గురిఆయినారంటే ఆశ్చర్యం దేనికి? నోరులేని పశువులనుకూడా రోజుకు ఒక్కసారయినా శుభ్రంగా కడుగుతారు. చివరకు కాకులు సయితం నీటిలో మునగటం మనం తరుచు చూస్తూనే వుంటాము. అటువంటప్పుడు జ్ఞానం ఎరిగిన మానవుడు స్నానం చేయకపోతే ఏమనాలి?

తిండి, గుడ్డలకంటెకూడ స్నానం ఎంతో ముఖ్యమైంది. స్నానంవల్ల శరీరంలోనించి మురికి పోవటమేగాక, కొత్తశక్తి, కొత్త ఉత్సాహము కలుగుతవి. జవము, జీవమూ చేకూరుతవి. ఒక్క స్నానాన్నిగురించి ఎన్నెన్నో విషయాలున్నయి. అవన్నీ వచ్చేసారి చెబుతా.

"మీ పెద్దమ్మ"




పైన వున్న తొమ్మిది బొమ్మలూ, అన్నీ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా, నిజానికి అలాలేవు. తొమ్మిదింటిలో రెండుమాత్రమే ఒక్కమాదిరిగా వున్నై. ఆ రెండు ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే

జవాబుకి 53-వ పేజీ చూడండి.




ఇప్పుడు మైలతుత్తం గమ్మత్తులు మరికొన్ని చెబుతాను: ఒక గాజుగొట్టంలోకి కొంచెం నవాసారం తీసుకుని, దానికి కొంచెం సున్నపునీరు చేర్చండి. దీని నుంచి ఘాటయిన వాయువు (అమోనియా) బయలుదేరి, అదంతా నీటిలో కరిగిపోతుంది. అది పూర్తిగా కరిగిపోయేవరకూ గొట్టం మూసివుంచాలి. తరువాత, పైకి తేరిన అమోనియా ద్రావకాన్ని వేరేగొట్టంలోకి తీసివుంచండి.

మరొక గాజుగొట్టంలో కొంచెం మైలతుత్తం నీటిలో కరిగించి, దానినికూడా ద్రావకంగా తయారుచేయండి. ఈ రెండు ద్రావకాలూ సిద్ధంగా వున్నాక, మైలతుత్తం ద్రావకానికి అమోనియా ద్రావకం బొట్టుబొట్టుగా చేర్చి, తమాషా చూడండి. ఆకుపచ్చగా వుండే మైలతుత్తంద్రావకం, ముందు లేతనీలిగా మారి, క్రమేణా ముదురునీలిగా తయారవుతుంది.

* * * * *

చిత్రమయిన రంగు మార్పులు కావాలంటే ఇవి చేసి చూడండి:

(1) ఒక చిన్న పటికముక్క తీసుకొని నిప్పుమీద ఉంచితే అది బుసబుసమని పొంగి, పెద్దదవుతుంది. దానిపైన ఒక్క నీటిబొట్టు వేసినట్టయితే, అంత ముక్కా అణగారిపోతుంది.

(2) కింది వస్తువులను నీళ్ళలో కరిగించి ద్రావకాలు తీసి, వేరేవేరే గొట్టాలలో సిద్ధంచేయండి. దిగువ చెప్పిన ప్రకారం ఆ ద్రావకాలను మిశ్రమం చేసినట్టయితే, కలపగా వచ్చిన ద్రావకం తెల్లగా, చిక్కగా చూడటానికి తమాషాగా వుంటుంది.

ఎప్సమ్‌సాల్టు (భేదికి ఉపయోగించేది) కి — చాకలిసోడా
ఎప్సమ్‌సాల్టుకి — సున్నపు నీరు
సున్నపునీటికి — చాకలిసోడా



పిల్లవాడు ఆడుకుంటూ, యింటివాకిలిదాటి రోడ్డుమీదికి వచ్చాడు. ఆ రోడ్డుదాటి యింకో రోడ్డుమీదికి పోయాడు. యిలా చాలదూరం పోయాడు. తల్లి గాబరాపడి వెతుకుతోంది. ఏదోవనపోతే పిల్లవాడు దొరుకుతాడో ఆమెకు చూపండి.

పజిలుకు జవాబు



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 క | | 2 ది | | 3 త్రా | |
| 4 నే | ల | ◎ | 5 శ | 6 రీ | ర | ము |
| | 7 హా | రి | ◎ | తి | ◎ | |
| 8 పా | ము | ◎ | 9 శ్రీ | ◎ | 10 గో | డ |
| | ◎ | 11 పి | ◎ | 12 ఊ | డా | |
| 13 భా | 14 ర | త | 15 ము | ◎ | 16 వ | ల |
| | వి | | ని | | రి | |

★

51-వ పేజీలోని చిక్కు బొమ్మలకి జవాబు:

6, 8 నెంబర్లుగల బొమ్మలు రెండూ ఒక్క మాదిరివి

★

# హిందీ నాల్గవ పాఠము

అబ్బాయిలూ, అమ్మాయిలూ!

క్రిందటి నెల మీరు గుణింతాలు నేర్చుకొన్నారు. ఈ నెల వత్తులు నేర్చుకోండి! ఈ క్రింది మార్పులు గమనించండి.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| क | + | ख | = | क्ख | ఉదాహరణము: | मक्खी |
| ग | + | य | = | ग्य | — | भाग्य |
| म | + | न | = | म्न | — | निम्न |
| ट | + | ठ | = | ट्ठ | — | गट्ठा |
| र | + | ज | = | र्ज | — | कर्ज |
| ज | + | र | = | ज्र | — | वज्र |
| म | + | य | = | म्य | — | रम्य |
| व | + | य | = | व्य | — | नव्य |
| प | + | य | = | प्य | — | प्यास |
| त | + | न | = | त्न | — | यत्न |
| व | + | य | = | व्य | — | व्याघ्र |
| स | + | व | = | स्व | — | स्वप्न |

పైన యిచ్చిన వత్తులనుబట్టి మనము కొన్ని నియమములు ఏర్పరచుకోవచ్చు.

గీటు ఉన్న అక్షరాలు కలపవలసి వచ్చినప్పుడు మొదట పలికే అక్షరం తాలూకు నిలువు గీటు ఉండదు.

ఉదాహరణము: प + य = प्य, प्यास, व + य = व्य, व्यय, म + य = म्य, रम्य

అయితే ఒకటి, न వత్తు మాత్రం ఎప్పుడూ అక్షరం క్రిందనే చేరుతుంది.
ఉదాహరణము: निम्न, कृतघ्न, जमदग्नि.

నిలువు గీటు లేని అక్షరాలు కలపవలసివచ్చినప్పుడు ఒకదాని క్రింద ఒకటి చేర్చాలి:—

ट + ट = ट्ट—हट्टा - कट्टा, ठ + ठ = ठ्ठ—मठ्ठा, द + द = द्द—गद्दी, ड + ड = ड्ड—गड्डा, ल + ल = ल्ल....लल्ला

ఈ భేదం గమనించండి:—

कर्ज, वज्र ఒకటి र + ज = र्ज, రెండవది ज + र = ज्र

ह కు మాత్రం ు, ృ ఇవ్వవలసివచ్చినప్పుడు ఇలా ఇస్తారు — हु, हृ हृद, हृदय। ट, ठ, ड, ढ ఈ నాలిగింటికీ ్ర ఇలా ఇస్తారు — ट्र ट्राम

అక్షరాలు కలపటానికి ఇంకోమార్గంకూడా ఉంది. అది ఇలా स + य = स्‍य। అంటే మొదటి అక్షరానికి ् ఇస్తే అది సగమే పలుకుతుంది. కాని ఇది ఎక్కువ వాడుకలో లేదు.

ఈ క్రిందివి గుర్తుపెట్టుకోండి:—

ह + य = ह्य - असह्य; द + म = द्म - पद्म; द + य = द्य - गद्य

వచ్చేనెల క్రొత్త పాఠం నేర్చుకొందురు గాని. ఈనెల పాఠం జాగ్రత్తగా చదువుకోండి. లేకపోతే వత్తులు ముందు ముందు ఇబ్బంది పెడతాయ్.



క్రిందటి నెల ‹పాముల బొమ్మకి' రంగులు వేశారుకదూ. ఇప్పుడు ఈ సీతాకోక చిలుకల బొమ్మకి ఏ రంగులు వేస్తే బాగుంటుందో అలా రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (అగష్టు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors : CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama, July '49

Photo by B. Ranganadham

చుక్కల్లో చంద్రుడు

